"కళావాణి"

సంపాదకవర్గం



కె. యల్. నరసింహారావు

(సంపాదకుడు)

కె. మంగయ్య

శ్రీరామకవచం సత్యనారాయణ

సి. వి. కృష్ణారావు

కె. వి. ఆర్. నరసింహారావు



స్థాపితం:

1948 జనవరి



# ఆదర్శలోకాలు

[ జాతీయనాటకం ]



రచన:

కె. యల్. నర[illegible]

"కళావాణి" కార్యాలయం

రేపాల, మాధవరం పోస్టు

వయా- జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా

# అంజలి



కన్నబిడ్డకన్న ఎక్కువ చనువుగా తమయింట్లోవుంచుకొని, నా చదువు సంధ్యల్లో బాధ్యత తీసుకొని - ఓం ప్రథమంగా 'నాట్యకళ'లో ('విజయ సింహా'లో వేషమిచ్చి)అభిరుచికలిగించిన నాగురుదేవులు వై. వై. శర్మగారూ—

చదువు నాపాక - అత్యావసరస్థితుల్లోకూడా యింటిసంగతే పట్టించుకోకుండా - సినిమాలు, నాటకాలు, పుస్తకాల గొడవల్లోపడి వృథా ఖర్చు, తిరుగుడుకు స్వేచ్ఛనిచ్చిన మానాన్న కె. వి. నరసింహారావుగారూ—

నాకు- గ్రంథపఠన, రచనకూ, నాటకానుభవానికూ అవకాశాలు కల్పించిన గ్రామ వెలుగూ—

నాలో ఏదో తెలియని విప్లవాన్ని రేపి- జీవిత పరమావధిని బోధించిన గోపీచంద్, చలం, కుటుంబరావుగార్ల రచనలూ—

నాకు తెలియని ఎన్నో విషయాలను - క్రొంగొత్త - భావాలతో, వింతైన వ్రాతలతో బుర్రకెక్కించిన- సినిమాలు, పుస్తకాలు, పత్రికలూ—

నా ప్రప్రథమ రచనను తిరగ్గొట్టకుండా- నా రచనోత్సాహాన్ని ద్విగుణీకృతంచేసి, యిందాక రప్పించిన వెంకి పిల్లా—

ఇంత తొందరలో గ్రంథం బయటపడటానికి ప్రయాసపడ్డ మిత్రుడు శ్రీరామకవచం సత్యనారాయణా......

ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఈ వ్యక్తుల (శక్తుల) సహకారమే లేకుంటే- నేనీ నాటకాన్ని వ్రాయగలిగేవాణ్ణికాదు.

వారి (వాటి) ఋణాన్ని మరేరూపంలో తీర్చుకోలేనుగనుక- యిదే నా హృదయపూర్వకమైన.........



# పరిచయం



రచయిత నరసింహారావుది- మునగాలసీమలోని పల్లె రేపాల. కొన్ని అవసరాల్ని బట్టి పల్లెలో వుండిపోక తప్పిందికాదు.

మొదట్లోపల్లెలో యీయనకు స్నేహితులంటూ ఎవరూ దొరక్క-పోగా- సినిమాలుగాని, నాటకాలుగాని, గ్రంథాలుగాని లభించే అవకాశమే లేక నానాఅవస్థ పడాల్సివచ్చింది.

అలాంటి పరిస్థితుల్లో- ఆయన అవసరానికే అనుకోండి- ఎన్నో ప్రతిఘటనల నెదుర్కొంటూ - "గ్రామవెలుగు" అను లిఖిత మాసపత్రికను నడుపుతూ, గ్రంథాలయాన్ని నెలకొల్పి, నాట్యమండలిని తయారుచేసి- స్నేహితులను, అభిమానులను సృష్టించుకున్నాడు.

ఆయన అవసరాలు సంఘానికి వినియోగపడ్డందువల్ల పూర్తి బాధ్యత కూడామీదపడ్డది.

"గ్రామవెలుగు" గ్రంథాలయ విరాళాలకోసం నాట్యమండలి నాటక ప్రదర్శనలు చాలాఅవసరమయ్యాయి. అందుకని, మంచినాటకాలు వ్రాసేదుకు నరసింహారావు పూనుకోవలసివచ్చింది. మొదట్లో "విప్లవశంఖం" అను నాటకాన్ని వ్రాశాడు. చాలా గొప్పగావుంది. అది, అనేకచోట్ల ప్రదర్శింపబడింది. తర్వాత- దేశ కాలపరిస్థితులను దృష్టిలో వుంచుకొని, అయిదు నెలల క్రిందటే యీ "అదర్శలోకాలు" సృష్టించాడు. ఈయన, నాట్యమండలిని దృష్టిలో వుంచుకొనే- ఏ నాటకాన్నయినా వ్రాస్తాడు గనుక ప్రదర్శనలు తప్పవు "ఆదర్శలోకాలు" ప్రదర్శనలు సాగుతున్నాయి. ప్రస్తుతం మరో క్రొత్తది "ప్రజాసేవ" వ్రాశాడు. కొద్దిరోజుల్లో అదికూడా బైటిప్రపంచానికి రావొచ్చు,

నాట్యమండలికి రచయిత, డైరెక్టరే కాకుండా— స్వయంగా నటిస్తాడు. ఎన్నో కథలు, సినిమా వ్యాసాలు వ్రాశాడు. అప్పుడప్పుడు రూపవాణి, వెంకిపిల్ల, ఆనందవాణి, పడోసి...లలో ఆయన రచన లగుపడ్తుంటాయి.

ఈయన అభిమాననటుడు సి. హెచ్. నారాయణరావు. అభిమాన గ్రంథం "ప్రపంచసరళి". అభిమానరచయితలు గోపీచంద్, చలం, కుటుంబరావులు. ఈయన pen Name "కోలన్"

సౌమ్యభావాలతో అన్ని సంస్థలలోని (పత్రిక, గ్రంథాలయం, నాట్యమండలి) మెంబర్లను చీలిపోకుండా నడుపుతున్నాడు.

ఎవరితోనైనా హృదయంతో నమ్మిగాని స్నేహంచేయడు. మాట్లాడడం తక్కువ, వ్రాయడం ఎక్కువ. సంభాషణల్లో వ్యంగ్యం, హాస్యం జాస్తిగా వుంటుంది.

"గాలిమేడలు" నవల వ్రాస్తున్నాడు. ఆశయా లెన్నో వున్నాయి. నాటక రచనలో ఎక్కువ కృషిచేద్దామనీ, 'సినిమాకళ'లో జీవితాన్ని సాగిద్దామనీ, 'కళావాణి' అను పత్రికను నడుపుదామనీ...

ఇలాంటివెన్నో వున్నాయిగాని- పల్లెటూరు. సలహాలిచ్చే పెద్ద రచయిత లెవరూ దగ్గరలేరు. అంతా స్వయంకృషి, గ్రంథసహాయం. అంతే. మిత్రుణ్ణిగూర్చి ఇంకేంతని వ్రాయాలి? ఇప్పటికైనా ఆపకుంటే బాగుండదు.

రేపాల,
6—3—48.

కె. మంగయ్య.

# ముందుమాటలు ★ ★ ★

ప్రదర్శనా యోగ్యమైన నాటకం వ్రాయాలంటే— చాలా చిక్కులతో కూడుకున్న పని.

నాటక ప్రదర్శనకుపట్టు కాలమూ—నాట్యమండలి (సామాన్యమైనది)కి తగ్గ మెంబర్లూ, ముఖ్యంగా స్త్రీపాత్రలూ—విసుగు కలిగించని, పాత్రధారులు హడావుడి పడకుండా రంగవిభజనని భావంచెడకుండా బిగువైన సంభాషణలూ—హాయిని కలిగించేపాటలు, పద్యాల అవసరాలూ—రక్తి చెడకుండా వినోదమూ—సహజత్వానికి లోపంలేకుండా ఆశ్చర్యపరిచే సన్నివేశాలూ...ఇలాంటివెన్నో దృష్టిలోవుంచుకొని- మళ్లీ కథావిధానం చెడకుండా జాగ్రత్తగా చూచుకోవాలి.

నానాఅవస్థపడి వ్రాశాక-ప్రదర్శనయ్యేదాకా భయమే. వాటితర్వాత వెలువడు విమర్శలు.

మహామహులువ్రాసిన నాటకాలపై వెలువడుతున్న విమర్శలుచూస్తుంటే నాటకరచనలో అంతగా అనుభవంలేని నాబోటివాడు వెనుకంజ వేస్తాడంటే ఆశ్చర్యంకాదు.

అయినా— వున్నఅనుభవంతో పెద్దల అడుగుజాడల్లో నడుద్దామని ప్రయత్నించాను. మంచిఏమైనాఉంటే వారిచలువే. తప్పటడుగులు పడితే మాత్రం నాపొరపాటే! విమర్శకుల సలహాలను పాటించటానికి, తప్పులసవరణకు ప్రయత్నిస్తాను.

ఇక కథావస్తువు:—

ఎన్నో విప్లవశక్తుల త్యాగఫలితంగా మనకి స్వతంత్రం లభించింది. త్యాగమంటే ఎరుగని అభివృద్ధినిరోధకులు, మతహంకారులు, గూండాలు

మాత్రం- ఎలాగో మన స్వతంత్రాన్ని కొల్లగొట్టి, దేశాన్ని శ్మశానవాటికగా చేయాలని ప్రయత్నిస్తున్నారు. అలాంటి దుండగీంద్ర బారినుండి దేశాన్ని రక్షించుకొని, స్వతంత్రాన్ని కాపాడుకోవడం ప్రతి భారతీయుని కర్తవ్య మన్నదంలో వివాదంలేదు. తర్వాతనే- శాంతిసౌఖ్యాలు, "ఆదర్శలోకాలు"

ఈనాటకానికి అవసరమైన కొన్ని పద్యాలు, పాటలు వ్రాసియిచ్చిన శ్రీ వారణాసి వెంకటనారాయణశాస్త్రి, శ్రీ శ్రీ రామకవచం సత్యనారాయణగార్లకు నాకృతజ్ఞత.

అవసరమైన చోట్లయితరుల పాటలు అనుమతిలేకుండా వాడుకున్నందుకు క్షంతవ్యుడను.

నాటకం వ్రాయగానే- ప్రదర్శనలు సాగితేగాని తృప్తిలేదు. అట్టిప్రదర్శనలిస్తూ- నాకు ప్రోత్సాహమిస్తున్న "గ్రామవెలుగు" నాట్యమండలివారికీ కృతజ్ఞతాభివందనాలర్పిస్తూ...

రే పా ల,<br>12—3—48.

న ర సిం హా రా వు.

# "ఆధర్శలోకాలు"

[ జాతీయ నాటకం ]



రచన & డైరెక్షన్ : కె. యల్. నరసింహారావు
పద్యాలు : వారణాసి వెంకటనారాయణశాస్త్రి
పాటలు : "వారణాసి" K.L. & శ్రీరామకవచం సత్యనారాయణ
ఆర్ట్ & మేకప్ : M. V. భద్రం
హార్మోనియం : తేరాల సూర్యనారాయణశర్మ
తబలా : వట్టికోట సింగరాచార్యులు
ఫిడేల్ : శ్రీ రాయపురం మంగాచార్యులు
నిర్మాణం : "గ్రామవెలుగు" నాట్యమండలి, రేపాల.

| | |
|---|---|
| అబ్బాస్ : V. R. K. మూర్తి | రఘుపతి : S. L. దాస్ |
| మధు : K. M. శ్రేష్ఠి | బలరాం : M. అబ్బయ్య |
| సేఠ్జీ : T. R. ఆచార్య | లీల : K. లక్ష్మయ్య |
| శివరామయ్య : V. R. నాయకులు | ప్రభ : V. N. సింహాం |

భిక్షకుడు : C. S. నారాయణరావు
భిక్షక కుర్రవాడు : గంథం నర్సయ్య
వాలంటీర్లు & ప్రజలు } M. L. నారాయణ, M. మల్లేశ్వర్, S. రామదాస్

—: ప్రథమ ప్రదర్శన :—

సుమారు 10 వేల ప్రజానీకానికి మునగాలలో గాంధీస్మారక దినోత్సవ సందర్భంలో పరగణా కాంగ్రెస్, స్టేట్ కాంగ్రెస్ వారి సాయంతో 12-2-1948 తేదీన

## ఇందులో

| | | |
|---|---|---|
| అబ్బాస్ | ముస్లిం యువకుడు | 25 సం॥లు |
| మధు | హిందూ యువకుడు | 24 సం॥లు |
| సేఠ్జీ | పెట్టుబడిదారు | 45 సం॥లు |
| శివరామయ్య | అగ్రహారీకుడు | 50 సం॥లు |
| రఘుపతి | గూండా నాయకుడు | 29 సం॥లు |
| బలరాం | గూండా నాయకుడు | 27 సం॥లు |
| లీల | సేఠ్జీ కూతురు | 16 సం॥లు |
| ప్రభ | సంగీతపాఠకురాలు | 15 సం॥లు |

ఇంకా సమయాన్ని బట్టి—

భిక్షుకుడు

వాలంటీర్లు

ప్రజలు—

వస్తూ పోతుంటారు.

### గమనిక

ఈ నాటకాన్ని ప్రదర్శింపగోరువారు ముందుగా రచయితకు తెలుపాలి. విత్తంమీద వుద్దేశంకాదు. అవసర సూచన లివ్వడానికి అవకాశముంటుంది.

ఇప్పుడున్న పద్యాలేకాకుండా- యింకా కావాలనుకునేవారు రచయితపేర 'కళావాణి' కార్యాలయానికి వ్రాసి తెప్పించుకోవచ్చును.

ఇట్లు

రచయిత

# మొదటి రంగం

బహిరంగస్థలం, మీటింగు సన్నాహం

[ ముందు పాట పాడుకుంటూ మధు, అబ్బాస్‌లు జాతీయ పతాకాలతో ప్రవేశిస్తారు. వెనుక ప్రజలు, వాలంటీర్లు వుంటారు. ]

— పాట —

దేశముకొరకై చేయర త్యాగము - నీవగు ధర్మము రా
పేదసాదల ప్రేమింపుమురా -
భేదము లెంచకురా ॥దేశము॥
గాంధీ యోధుని స్మరియింపుము రా -
శాంతిని కూర్పగ రారా వీరా
సత్యాహింసావ్రతమును వీడకు ॥దేశము॥
కులమత భేదములను పరిమార్పుము -
కరుణాయుతుడవు కమ్మా ధీరా
దేశసేవయే ధీయుతధర్మము ॥దేశము॥

(వారణాసి)

(పాటఅయ్యాక నినాదాలు)

స్వతంత్ర భారత్‌కూ - జై; జాతీయ ప్రభుత్వానికీ - జై

సర్వమానవ సమానత్వం - కావాలి !

సర్వమానవ సౌభ్రాతృత్వం - కావాలి !

శాంతి సౌఖ్యాలు - కావాలి !

హిందూ, ముస్లిం - ఏక్ హై

**గూండాయిజం - నశించాలి; దోపిడీవిధానం - నశించాలి !**

దారిద్ర్యకాటకాలు-నశించాలి; మూఢాచారాలు-నశించాలి !

నిరక్షరాస్యత - పోవాలి ! నిరంకుశత్వం - పోవాలి !

మతభేదాలు - పోవాలి !

గూండాలను - అరికట్టాలి; దేశాన్ని రక్షించాలి !

స్వతంత్రాన్ని కాపాడాలి !

[ప్రజలంతా కూర్చుంటారు. వాలంటీర్లు అట్టలు, పతాకాలు ఒకచోట వుంచి ప్రజల సర్దుతుంటారు. ప్రజల్లో ఒకమూల రఘుపతి, బలరాంలు; మరో మూల లీల కూర్చుంటారు. ప్రజలనుండి ఒకరులేచి సభకు అబ్బాస్‌ను అధ్యక్షుని చేసి పూలమాల అతని మెడలో వేస్తాడు. చప్పట్ల మధ్య అబ్బాస్ కుర్చీలో కూర్చుంటాడు. బల్లపైనున్న కాగితాన్ని చూచుకొని నిలుచొని]

ప్రస్తుతం శ్రీ మధుసూదన్‌గారు మాట్లాడ్తారు.

[తిరిగి కూర్చుంటాడు. మధు లేచి—]

సోదరసోదరీమణులారా!

నేటి కల్లోలప్రపంచంలో మన భారతావనికి లభించింది స్వాతంత్ర్యమా? లేక మహానరకమా? అని తబ్బిబ్బు పడవలసిన

భయానకదృశ్యాలు కనబడుతున్నాయంటే, మన పరిస్థితేమిటో వూహించండి! కాని, కేమో? మనచేతిలోకి ప్రభుత్వంవచ్చింది.

ఇందులో హిందూ ముస్లిం భేదాలేమిటి? అసలెందుకీ తగవులు? నిజంగా వీరికి బుద్ధికూడా ఉందా? లేదా? అని మనం ఆలోచించాలి. ఈనాడు మనలోమనం పుల్లవిరిచి మీద వేసుకున్నామంటే- అది ఎదుటి శత్రువుకొక విజయచిహ్నమని గాని, మన జాతీయప్రభుత్వాని కొక సమ్మెటపోటని గాని- ప్రజలు తెలిసికోలేకపోవడం విచారకరం. తిరిగి మనం బానిసలు కావాలనేనా— ఈ పోట్లాటలు? అందుకనేనా— మనతాతలు, ముత్తాతలు, అన్నలు, తమ్ములు, అప్పలు, చెల్లెండ్లు- తమ సర్వాన్ని ధారపోసి ప్రాణాల నర్పించింది? మన దెబ్బలాటలు చూస్తే, వారి ఆత్మలెలా ఘోషిస్తాయి? ఇదేనా-మనకృతజ్ఞత? ఇదేనా- మన గమ్యం? పిచ్చి మతావేశాల్లో పడి, మానవత్వాన్నే మంటగలుపుతున్న మన సోదరులను చూస్తే- జాలి, చికాకు వేస్తుంది. వారి బాధ్యతేమిటో గుర్తించటంలేదు.

స్వాతంత్ర్య మంటే అల్లరి చేయడం కాదు.— బాధ్యత గుర్తించడమే. అప్పుడే దానివిలువ మనకు తెలుస్తుంది. అందుకనే— మనమంతా మన నాయకుల ననుసరించాలి. ఒక త్రాటి మీద నడవాలి. ఎదుటి ప్రపంచానికి ఆదర్శవంత మనిపించాలి.

మనకు మతాలెందుకు? తిన తిండి, కట్ట బట్ట, వుండ యిల్లు కావాలి. చదువు, తెలివితేటలు కావాలి. అందరమూ

సోదరులుగా మెలగాలి. అంతేగాని- ఈ బాధ్యత నెరుంగని పోట్లాటలతో మన సోదరులే ఎలాంటి దారుణ ప్రమాదాలకు లోనై నికృష్టదశ ననుభవిస్తున్నారో, ఒక్కసారి వెనుదిరిగి ఆలోచించుకోవాలి. దీనితో లభించే దేమిటో తెలుసుకోవాలి. మనం వూహిస్తున్న స్వర్గద్వారం ఎంత వెనక్కు జరుగుతున్నదో గమనించాలి.

కనుక- కల్లోలాలు రేపడం మన ధర్మంగాదు. సోదర మానవుల చంపడం మనకు న్యాయంకాదు. మన నాయకులను కష్టస్థితిలో వదిలెయ్యడం మనకు పాటిగాదు.

మన బాధ్యతను గుర్తించి- దేశాన్ని దుంఖగర్త నుండి కాపాడుకుంటే శాంతి, సౌఖ్యం, ముక్తి అని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

(చప్పట్ల మధ్యలో మధు కూర్చుంటే, అబ్బాస్ లేచి——)

సోదర-సోదరీమణులారా!

మన కష్టాడే పూర్తి స్వాతంత్ర్యం రాలేదు. బ్రిటిష్ వాళ్ళకుట్రలు సాగుతూనే వున్నాయి. సంస్థానాధీశులు మనను కబళించాలని చూస్తున్నారు. మహమ్మదీయులు కొందరు దీన్ని ముస్లిం సామ్రాజ్యంగా చేసి నరకలోకం చేయాలని ప్రయత్నిస్తున్నారు. కొందరు హిందువులు దీన్ని హిందూసామ్రాజ్యంగా చేసి మన సామరస్యాన్ని చెడగొట్టాలని ప్రయత్నిస్తున్నారు. పెట్టుబడిదార్లు మనను బానిసలుగా చేయాలని పడరాని పాట్లు

పడుతున్నారు. గూండాలు మన పవిత్ర జన్మభూమిని కొల్ల గొట్టాలని చూస్తున్నారు.

కనుక- యింతమంది స్వార్థపరులు, దుండగీండ్రు, అభి వృద్ధి నిరోధకులు, నిరంకుశులనుండి మన జాతీయప్రభుత్వాన్ని రక్షించడానికి ప్రజలంతా సర్వవిధాలా ప్రయత్నించాలి. అందు కోసం మనకు ఐక్యత చాలా అవసరం. అర్థంలేని పార్టీలుగా చీలిపోయి దేశాన్ని మంది కప్పగించుకోవడం తెలివితక్కువ.

మునుముందు మనం గూండాలను, దుండగీండ్రను, మత హంకారులను దిట్టంగా ఎదుర్కోవాలి. ఎందుకంటే - వారి హింసాకాండ, దోపిడీలు పట్టపగలే పబ్లిక్‌గా సాగిపోతు న్నాయి. ప్రజల చేతుల్లోకి ప్రభుత్వం వచ్చేసరికి వాళ్ళకు అలుసైపోయింది. వారి ఆటలు ఏమాత్రం సాగనివ్వకూడదు. మనమంతా సైనికులుగా తయారై ఎక్కడివాళ్ళ నక్కడే అణచిపారేసేందుకు ప్రజలంతా జాతీయప్రభుత్వానికి అండగా నిల్చి మన పరువును మనం కాపాడుకోవాలి. మనదేశం మత సామ్రాజ్యం కావడానికి వీల్లేదు. మనమంతా సుఖంగా జీవి స్తున్న యీ పవిత్ర భూమిలో మతకీచులాటలకు తావులేదు. మనది ప్రజారాజ్యం! మనది ఆదర్శలోకం!!

ఈ మన ప్రతిష్ఠను నిలుపుకోడానికి ప్రజలంతా వుత్సా హంతో గూండాల నెదుర్కోవాలి. లేకుంటే—మన ప్రాణాలు,

దక్కవు. మన స్త్రీల మానాలు దక్కవు. మన శిశువుల పీకెలు దక్కవు. తెలుసుకోండి! మేలుకోండి! లేవండి! నడుం కట్టండి... ...

(ఉపన్యాసం ఉద్రేకవంతంగా పోతుండేసరికి సభలో గల్లంతు. అంతా లేస్తారు. కొందరు చెల్లాచెదరౌతారు. బలరాం - కర్రతీసుకొని అబ్బాస్ తలపై బాది పరుగెత్తుకొని పోతాడు. అతనితో పాటు రఘుపతి పరుగెత్తుతాడు వారిని పట్టుకోడానికి ప్రజలు, వాలంటీర్లు వెళతారు. అబ్బాస్ తలనుండి రక్తం కారుతుంటుంది. మధు గుడ్డకోసం లోనికి పరుగెత్తుతాడు. లీల - దగ్గరకివచ్చి తాప్సుగ తన చీరకొంగు చించి అబ్బాస్ గాయానికి కడుతుండగా - మధు గుడ్డపేలికతో ప్రవేశించి దిగాలుపడుతుండగా...)

— తెర —

# రెండో రంగం

## సేఠ్జీ ఇల్లు

[ గల్లాపెట్టెముందు సేఠ్జీ చేతులుమోడ్చి దండకం చదువుతూ ]

— దండకం —

భగవతీ! భాగ్యలక్ష్మీ! మహాలక్ష్మీ! నిన్నెన్న లేనమ్మ నీశక్తిచే లోకమెల్లన్, ప్రభావాలతో గూడి, రాజిల్లు చుండంగనో తల్లీ! యే కార్యముజ్జేసినన్గాని, త్వదీయ కృపాసాదరా కాంక్షినై నేను, ఆహార విహారాదులన్నీడి రాత్రింబవళ్ళన్న భేదంబులేమాని నీకై తపంబాచరించే మహావీరులన్, జేతిలో పట్టుకున్నాను నిన్నమ్మి, నీకన్న వేరే యిలన్ దైవంబు లేడటంచున్ సదానమ్మి నీమూర్తి, నిన్గాంచి, పాపంబదీ, పుణ్యంబిదీ, అన్న మూఢవిశ్వాసముల త్రోవలన్ బోక, ఎందెందరో వ్యక్తులన్ జీవముల్ శేషమాత్రంబులే లేని చందానచేయించి,

ప్రేమించి, పూజించుచున్నాడ, నిన్నే మహాతల్లీ! ఓ లక్ష్మీ! మాలక్ష్మీ! తల్లీ! నమస్తే!! నమస్తే నమస్తే!! నమః!!!

(వారణాసి)

[ దండకం పూర్తయ్యాక హారతి వెలిగించి సెట్టైకు చూపించి, వెంటనే ఆర్పేసి - అక్కడినుంచి లేచి కుర్చీల దగ్గరికొచ్చి పత్రిక బిగ్గరగా చదువు తూంటగా రఘుపతి, బలరాంలు ప్రవేశిస్తారు. గదిలో ఒకమూల పెద్దది గాంధీ విగ్రహం ]

"మన భారతభూమి హిందూ సామ్రాజ్యంగాని, ముస్లిం సామ్రాజ్యంగాని, కావడానికి ఏమాత్రం వీల్లేదు. ఎలాంటి దుండగీంద్రులైనా నిర్దాక్షిణ్యంగా అణచివేస్తాం. మైనారిటీలకు రక్షణకల్పిస్తాం. మతసమస్యల కతీతమైన ప్రజారాజ్యమే మన ఆశయం" ఏరోయ్! చూశారా! జవహర్లాలు గంభీరోపన్యాసమట!

రఘు : ఒకవంక మనలను వికలాంగులను చేయ
ముస్లిం నినాదముల్ మ్రోగుచుండ
ఒకవంక స్వేచ్ఛతో నుత్సాహులై హిందు
మతపక్షపాతుల వెతసుచుండ
ఒకవంక హిందువుల్ సకలంబులన్ వీడి
ఇతర దేశంబుల కేగుచుండ
ఒకవంక హైందవ ప్రకరాళినిన్ బట్టి
హత్యలు, దోపిడీ లలరజేయ

శాంతమో, శాంతమో సఖ్యతోయటంచు
ఏడ్చుమూర్ఖులు, నేటి ప్రభుత్వమందు
అలరుచున్నారు, మనలను అణగద్రొక్క-
అట్టివారల నూడ్చుట పట్టుమనకు

(వారణాసి)

పోనిద్దురూ! వెధవది! ప్రొద్దున్నే చదువక చదువక వాడి వుపన్యాసం చదివేగతే పట్టాలీ?

సేఠ్జీ : అదికాదులే! ముస్లింలు మెజారిటీగా వున్నచోట హిందువుల కత్తి కోతకోస్తుంటే - వీళ్ళకింతగా మతి పోయిందేమిటా? అని.

బల : మళ్ళీ మొదలా సేఠ్జీ! వాళ్ళ బుర్రలు యేనాడో ఖరాబై పొయ్యాయని తెలుసుకోలేక పోవడం వింతగా వుంది.

రఘు : ఏదోలేరా! ఇదివరకు కాంగ్రెసులో పనిచేసినవా రమ్యే. ఆ వాసనెలా పోతుంది?

సేఠ్జీ : నాకింకా ఆ బురద పూస్తూనేవున్నారు గదూ!

బల : ఇదిగో! నే నెక్కువగా కబుర్లు వినేవాణ్ణి కానం డోయి! అసలు విషయాలు మాట్లాడుకోవాలి.

సేఠ్జీ : అలాగే! (లీలను పిలిచి) లీలా! లీలా! బయట ఎవ రన్నా తిరుగుతున్నారేమో చూచి, తలుపుబెట్టి నీవు లోపలికివెళ్ళి చదువుకో అమ్మా!

లీల : (పిలవంగానే వస్తుంది!) మంచిది! (తిరిగి లోనికెళ్ళి పుస్తకం చేతిలో వుంచుకొని ప్రక్కగదిలోనుండి వారి సంభాషణలు వింటుంటుంది)

సేఠ్జీ : ఇక మాట్లాడండి!

రఘు : అయితే సేఠ్జీ! మనకు ఆయుధాల సరఫరా మందగించిందేం?

సేఠ్జీ : ఇతరచోట్లకూడా ప్రభుత్వం ఇక్కడిలాగానే సోదాలు ఎక్కువగా చేస్తున్నదట. అందులో - అక్కడివాళ్ళకు ముస్లింలబాధ కూడా అధికమైనట్లు తెలుస్తున్నది.

రఘు : ఏడిశాగు! సాడేతీన్ మంది ముస్లింలకు వాళ్లుజడిసేకంటే ఏవు రెట్టుకొనో, నల్లమందు తినో చావకూడదూ వెధవలు!

సేఠ్జీ : అంతా నీలాంటి వీరాధివీరులు కావద్దటోయ్ రఘుపతీ?

బల : మరింకా యెప్పుడౌతారు? అంతా సఫా అయ్యాకనా?

రఘు : పోగడ్తలకిది సమయంకాదు గానీండి! మొన్నటి ఆభరణాలు, పెట్రోలు ఎక్కడదాచారు?

సేఠ్జీ : ఎక్కడదాయాలో అక్కడే దాచాను. ఏమైనా క్రొత్త విశేషాలు జరిగాయా?

రఘు : ఏదోవొకటి చెయ్యంది- మన బలరాంకు నిద్రపట్టేగా!

సేఠ్జీ : ఏం బలరాం! ఏమిటి- సంగతులు?

బల : ఏమంత గొప్పవి కావనుకొండి. నాలుగు గృహాలు, రెండు ప్రభుత్వభవనాలు తగులబెట్టించాను. ఇవేళ,

ఒక్కడంటే ఒక్కడే ముస్లిం మనచేతిలో చావడం దురదృష్టమే అయినా- యీవేళ దొరికినంత డబ్బూ, నగలూ మన కెన్నడూ దొరక లేదనుకోండి !

సేఠ్జీ : రైటో ! అయితే- మొన్నటివస్తువులు తెమ్మంటారా ?

రఘు : ఇప్పుడెందుకూ ? రాత్రికి అవీ, యివీ ఒక్కచోట చేర్చి పంచుకోవచ్చులెండి గాని- ఈ సాయిబు ముండాకొడుకులకు మనవాళ్ల సహాయం ఎక్కువైపోతున్నదే ?

బల : అంతా సోదరప్రేమరా నాయనా ! సోదరప్రేమ !

సేఠ్జీ : కాంగ్రెస్ మహాత్మ్యమే మననిందాకా తెచ్చింది.

రఘు : పాడుముండాకొడుకులు ! దేశంనిండా పోగయ్యారు. జాతీయనాయకులట, జాతీయనాయకులు ! చివరకు మనకు కూడా ప్రత్యక్షమవుతున్నారు.

సేఠ్జీ : మరిచిపోయ్యా ! మొన్నటిసభలో వాడెవడో తురక గాడిదకొడుకును వేసుకున్నారేమో ! ఏమయ్యాడు ?

బల : వాడికింకా భూమ్మీద నాల్రోజులు గింజలున్నాయి. సేఠ్జీ ! మహాసభలో లెక్కప్రకారం కొట్టడానికి వీలు చిక్కదు చూడండి !

రఘు : అది సరేగాని- సేఠ్జీ ! మీ కూతురేదో వాడి గాయానికి కట్టు కట్టినట్లు తెలిసిందే ?

సేక్రజ్ఞ : ఎవరూ ? మా లీలా !...లీలా ! లీలా ! (పిలిసేపల కదు) పోనీండి కనుక్కుంటానుగాని- వాడిప్పుడేమైనా మారినట్టా ?

రఘు : అంతంత మాత్రనికే మారుతారా సేక్రజ్ఞ ! పుట్టుకతో పుట్టింది పుల్లలతోగాని పోదన్నట్టు- తండ్రికిపట్టినగతే వాడికీ పట్టేదాకా మనకు శాంతెక్కడిది ?

సేక్రజ్ఞ : అయితే- దానికేమైనా ముహూర్తం నిర్ణయించారా ?

రఘు : బలరాం తలుచుకుంటే క్షణంపట్టదు కాని, వీలు చిక్కొద్దూ ?

(గదిలో చదువుకుంటున్న లీల ఉలిక్కిపడి, చెవులు రిక్కించి వింటుంటుంది)

సేక్రజ్ఞ : చాలా జాగ్రత్తగా మెలగాలిసుమా !

రఘు : తాతకు దగ్గులునేర్పుతావా సేక్రజ్ఞ !

చంపితి నెందరెందరినో
శౌర్యప్రతాపము విస్తరింపగా
ఇంపగు గుంబతుల్ దరగ
లెన్నొ ఘటాఘట గూల్చివైచితిన్
తెంపు వహించితిన్, క్రమము
దీర్చితి- హైందవ సంఘసంస్కృతిన్
నింపెద రక్తధారలచె
నీ భరతావని నాల్గుమూలలన్

(వారణాశి)

సేఠ్జీ : ఏమిటోనోయ్! చేసేకార్యక్రమం గొప్పదిగనుక— ఎలాగైనా కొంత భయంగానే వుంటుందిసుమా!

బల : కార్యరంగంలోనికి దిగనివారి కలాగేవుంటుంది.

సేఠ్జీ : అదికాదు- నే చెప్పేది. ఒకవైపు ప్రభుత్వమూ, మరో వైపు ప్రజలుకూడా ప్రతిఘటిస్తున్నారు గనుక రహస్యంగా ప్రవర్తించాల్సి ఉంటుందని!

రఘు : అసమర్థపు ప్రభుత్వానికీ, ఆయుధాలు లేని ప్రజలకూ మనం భయపడాలటండి?

సేఠ్జీ : పోనీండి - మాటవరుసకన్నా నంతేగాని - యిప్పుడు ముస్లింల కనుకూలంగా వున్న హిందువుల సంగతేం చేద్దామంటారు?

బల : ఏంచేద్దా మేమిటండీ? ముద్దెట్టుకుందాం. అంతేనా?

రఘు : (వికటనవ్వు నవ్వుతూ) అంతే. అంతే.

సేఠ్జీ : అయితే - మన పటాలానికి అన్ని సరఫరాలు సరిగా జరుగుతున్నాయా?

రఘు : మన సరఫరాలకంటే - వాళ్ళంతట వాళ్ళే ఎక్కడో ఒకచోట కొట్టుకుంటూనే వున్నారు.

సేఠ్జీ : పోనీండి! మనం పోషించే భారంకూడా తప్పింది.

బల : రఘూజీ! మనం వెళ్ళొద్దూ! అక్కడవాళ్ళు మన కోసం ఎదురు చూస్తుండరూ?

రఘు : సరే. వెడదాం (లేచి) వెడుతున్నానండీ సేఠ్జీ! జాగ్రత్త

సేఠ్జి : (లేవడం సుర్యాద) అయితే - ఆ తురక వెధవ సంగతి తొందరలోనే తేల్చకుంటే - వాడు ఇంకా జనాన్ని పోగుచేసేట్టున్నాడు.

రఘు : మీకా భయమక్కర్లేదు. రెండు, మూడు రోజుల్లో వాడిపని అయిపోతుంది. బలరాం ! నీవికవాణ్ణి వెన్నంటి తిరుగుతూవుండు !

లీల : (నిజమా? కలా?)

బల : ఇంకా ఆలస్యమెందుకూ ? వెళదాం ! (వెళతారు)

సేఠ్జి : (పతిభంతా ఒలికిపొయ్యేటట్టు)

— పాట —

కాంగ్రెసు వారట—మంచివారలట
కనుగొందును నేనూ......
ప్రజారాజ్యమే-ప్రబల వాంఛయట
పిచ్చికాదె—ఈ మనుజులకు
ధనికుల బీదల—భేదములేని
స్వరాజ్యంబును-చవిచూచెదరా
అట్టివిధానము-ఎట్లొనగూర్తురో
కనుగొందును నేనూ......॥కాంగ్రెసు॥

లీలా ! లీలా ! ఏం చేస్తున్నావమ్మా ? (కూతురును పిలుస్తూ లీల గదిలోకి వెడతాడు. గదిలో లీల)

— పాట —

(ఈ వసంత సుమనోవనమూ ... మాదిరి)

సుందర భారతభూమీ...
కడు, యిడుములపాలై -
కుందుచునుండే ‖సుందర‖
త్యాగముచేసే - ముందుకుదూకీ
శమింపుడీ - ఈ అనలం
పావనమైనా - అమర భూమిలో
వీరుడ వయ్యేదవోయీ
ధీరుడ వయ్యేదవోయీ ‖సుందర‖

సేఠ్జీ : (హడావుడిగా) లీలా! లీలా! (అంటూ ప్రవేశించి) ఏంచేస్తున్నావమ్మా?

లీల : చదువుకుంటున్నాను. (అంటూ లేచి నిలుచుంటుంది)

సేఠ్జీ : సరేగాని - మొన్నటిసభలో తురకవెధవ గాయానికేదో కట్టు కట్టావటనే?

లీల : (ఇప్పుడే జ్ఞాపక మొచ్చిందా?) ఓహో! అతనా? అబ్బాస్ కదూ!

సేఠ్జీ : అబ్బాసో? గిబ్బాసో? తురకవెధవల పేర్లెందుకు లెద్దూ?

లీల : అతను చాలా మంచివాడునాన్నా! కవి. మంచి పాటలు, పుస్తకాలు వ్రాస్తాడు.

సేఠ్జీ : ఏడిశావ్ ? నేను - వాడి గాయానికి కట్టేందుకు కట్టా వంటే - యిదేంపోది ?

లీ ల : ఏదో - నా క్లాస్ మేట్ కదూ ! దెబ్బతగిలి రక్తం కారు తుంటే - చూడలేక కట్టుకట్టా నంతేనానా్న !

సేఠ్జీ : నేనేమో తన్నిస్తుంటా. నీవేమో కట్లు కడుతూవుండు!

లీ ల : అలాగని నాకేం తెలుసు ? అయినా - అదీ, ఒకందుకు మంచిదేలే. నీమీాద అనుమానా లెవరికీ వుండవు. (అమాయకురాలా ! అన్నట్టు) అయితే - మొన్నటి దాకా మనం కాంగ్రెసులో వుంటిమిగదా ! ఇప్పుడిట్లా చేస్తున్నావూ ?

సేఠ్జీ : అయ్యో లీలా ! నీకీమాత్రం ప్రపంచజ్ఞానం లేదేమే ? చదివిన చదువంతా ఏగంగలో కలిపావు ?

లీ ల : ఏంచదువులునానా్న ? ఏ ఆంగ్లోక్లిస్ - సింహాంలాంటి పాఠాలో చెబుతారుగాని-ఒక పుస్తకం చదువనిస్తారా? పత్రిక చదువనిస్తారా ? మరి నాకీ తికమిక లెలా తెలుస్తాయి ?

సేఠ్జీ : ఆగష్టు పది హేనుకుపూర్వం యిష్టమున్నా, లేకపోయినా బ్రిటిష్ వాడు వెళ్ళిపొయ్యేందుకు కాంగ్రెస్ లో చేరక తప్పలేదు. ఇప్పుడో ? బ్రిటిష్ వాడు వెళ్ళిపొయ్యాడు. ఇంకా కాంగ్రెసెందుకూ ?

లీ ల : ఏం ?

సేఠ్జీ : ఈ కాంగ్రెసుముండాకొడుకులు మన వ్యాపారాన్ని సాగనివ్వరుగా! ఏదో పెట్టుబడిదారీ విధానమని నాశనం చేస్తారు. అందుకని - మనం దాన్నిప్పుడు ఎదిరించాలి. తప్పదు.

లీల : అది, మోసంకాదునాన్నా ?

సేఠ్జీ : మోసమేంమోసం ? అసలందులో చేరడమే పెద్ద మోసం. మోసంలేకుంటే - వ్యాపారమే లేదు.

లీల : అయితే - యీ అల్లర్లు రేపితే యేం లాభం నాన్నా ?

సేఠ్జీ : ఒకప్రక్క మన సామ్రాజ్యం. మరోప్రక్క డబ్బు. ఇంకా యేం కావాలి ?

లీల : అబ్బా! ఒక్కదెబ్బతో రెండుపనులు!

సేఠ్జీ : మరేమనుకున్నావ్ - వ్యాపారమంటే! (చటుక్కున బుర్రతిరిగిందా?) అయితే నీకీ సందేహా లెందుకు కలిగాయో తోచకుండావుంది.

లీల : (ఏమీ ఎరగదా?) మీరెప్పుడూ ఏదో రహస్యంగా మాట్లాడుకుంటుంటారు. నాకేమో యేదీ తెలియక యిదివరకు లాగానె మనం కాంగ్రెసువాళ్ళమని సంచరిస్తుంటాను. నేనలా వుంటే మీకు ప్రమాదంకదూ!

సేఠ్జీ : కాదూ మరి! నీవేదో అడగబట్టి సరిపోయిందికాని, లేకుంటే చాలా కష్టమే వచ్చేదిసుమా!

లీల: అయితే, ముస్లింల చంపడమెందుకు నాన్నా?
సేఠ్జీ: వాళ్ళు మన హిందువుల చంపుతున్నారు గనుక!
లీల: అయితే, యిక్కడి తురకల చంపితే యేంలాభం?
సేఠ్జీ: అక్కడి హిందువులను చంపడం ఆగిపోతుంది.
లీల: అయితే, ఇంకా హిందువులంతా పారివస్తూనేవున్నారు గదా! ఏమిటో నాన్నా! నాకు చంపేవాళ్ళంటే, దుండగీండ్రంటే భయమవుతుంది నాన్నా!
సేఠ్జీ: పిచ్చిపిల్లవు! రఘుపతంతవాడుండగా భయమేమిటీ?
లీల: ఏమో! అతనే చంపడుగదా!
సేఠ్జీ: ఛీఛీ! అయితే, మన మిల్లుకార్మికులంతా లేరూ?
లీల: ఏమిటో, నాకైతే అయోమయంగావుంది నాన్నా!
సేఠ్జీ: ధూ! ఇంత పిరికిపుటకనుకోలేదు! (విరక్తిగాలోని కెడతాడు)
లీల: [ఆవేదనతో]

— పాట —

అవనిపై జరిగేటి
అవకతవకలు జూచి
ఎందుకో నా హృదిని
ఇన్ని ఆవేదనలు ?

తప్పు దిద్దగలేను
దారిచూపగలేను

తప్పు చేసినవారి
దండింపగా లేను
కష్టపడు వారలను
కాపాడగా లేను ॥అవనిపై॥

పరుల కష్టముజూచి
పగిలిపోవును గుండె
మాయమోసముజూచి
మండిపోవును ఒళ్ళు
పతిత మానవుజూచి
చితికిపోవును మనసు ॥అవనిపై॥

అవకతవకలు నేను
సవరింప లేనపుడు
పరుల కష్టముతోడ
పనియేమి నాకనెడు
అన్యులను జూచైన
హాయిగా మనలేను
॥అవనిపై॥

("కాళోజి")

[పాట పూర్తవుతుండగా]

—: తెర :—

\-

# మూడో రంగం

## శివరామయ్య యింట్లో గది

(రెండు కుర్చీలు, డ్రాయరు, బీరువాలో పుస్తకాలు, ట్రంకులో దుస్తులు, దండెంపై గుడ్డలు, ఒకచోట సబ్బు, గోడలకు జాతీయనాయకుల పటాలు, సినిమా చిత్రాలు, అద్దం, దువ్వెన — యివన్నీ అలంకరింపబడి వుంటాయి.)

(మధు— ప్రభకు హార్మోనియంపై పాట నేర్పుతుంటాడు.)

— పాట —

('ఝుం ఝుం బర్సే బ దల్ ఆ......' మాదిరి)

కళ కళలాడే భారతభూమీ
విధ్వంసంబాయె నేడూ
కాపాడరావో భాయీ
కాపాడరావో...... ||కళకళ||

మానవత్వపు మాటే మరచిన
ఘోరమూ-కడు-భారమూ
భుగభుగమంటలు మింటికి ఎగసే
క్రూరమూ-మహా-పాపమూ ॥కళకళ॥

(పాటయ్యాక, మధు- ప్రభ సంగీతపుస్తకం మీద పాఠం వ్రాస్తూ)

మధు: ఏం ప్రభా! నిన్ను తీసుకెళ్ళడానికి మీ నాన్న వచ్చాడేమోగా!

ప్రభ : అవును. వచ్చాడు. వెళ్ళిపోయ్యాడు.

మధు: ఏం? అంత తొందరగా?

ప్రభ : పెళ్ళీడుకు వచ్చిన పిల్ల. పంపుదామంటాడు మామ. ప్రభ లేకుండా నేను బ్రతుకలేనంటుంది - అత్త. ఇక, అక్కగారికి కోపంవస్తుందని నాన్న ఉట్టిగానే వెళ్ళిపోయాడు.

మధు : ఇంతకూ, నీకు వెళ్ళాలని వుందా ? ఉండాలనా ?

ప్రభ : సంగీతమంతా వచ్చేదాకా - నేను వెళ్ళకేం ?

మధు : దీనికొాక అంతుందా యేం ?

ప్రభ : పోనీండి - మీరు, వెళ్ళమనేదాకా.

మధు : అయితే - నేనీ జన్మలో వెళ్ళమనను.

ప్రభ : అలాగైతే - నేను మరో జన్మదాకా కదలను.

మధు : ఇంకానేం ? నాతో పాటూ నాన్నతో చివాట్లు తింటూండు

ప్రభ : గురువుగారే తింటూవుంటే నాకేంతప్పు ?

మధు : మాటలు బాగా నేర్చావుగాని - ఈ పాఠం జాగ్రత్తగా చదువు సుమా !

ప్రభ : మరేం ఫర్వాలేదు. అయితే - అడుగుదామని మరిచే పోతున్నాను. మీరు అబ్బాస్‌గారితో తిరుగుతున్నారేం ? అతను సాయిబుగా ?

మధు : మీకీ మతబోధలు ఎవరు నూరిపోస్తున్నారు ప్రభా ? వాడు, నాకు ప్రియమిత్రుడు. అలాంటివాళ్ళతో మనకు తగాదా యేమిటీ ? పైగా - వాడి తండ్రికూడా మనతో కలిసి వున్నందుననే హత్య చేయబడ్డాడు.

ప్రభ : పాపం ! ఆ చంపేవాళ్ళు ఎలా దొరుకుతారో ?

మధు : ప్రతివాడూ ఎదురో-వాలి ! ఆ దుండగీండ్రను కనిపెట్టి, పట్టుకొని ప్రభుత్వాని కప్పగించాలి. సరిగాని- నీ దగ్గర కత్తివుంచుకొమ్మన్నాను. ఉందా ?

ప్రభ : ఇదిగో ! (రెప్పపాటులో సీరియస్‌గా నిలుచొని బాకును లాగి చూపుతూ) దీనికడ్డమొస్తే ఫైసలా ! ఏమంటారు?

మధు : ఇంకా యేమంటాను ?

ప్రభ : అమ్మో ! (లేనివణుకుతో) భయంకలగదూ ? ఖైదులో పెట్టరూ ?

మధు : నీమీది కొచ్చేవాళ్ళను ఎలాచేసినా శిక్షలేదులే! ఇదిగో! స్త్రీలనందరినీ నీలాగా ధైర్యంగా తయారు చేయాలి తెలుసా ?

ప్రభ : ఓ!

మధు : అబ్బో ధైర్యం! (పుస్తకం చేతికిస్తాడు)

ప్రభ : (పుస్తకం తీసుకొని) జైహింద్! (అనివెళ్ళిపోతుంది)

[మధు లేచి ఈలతో పాడుకుంటూ దువ్వుకుంటుండగా శివరామయ్య వచ్చి దువ్వెన లాక్కుంటాడు. ఇస్త్రీ బట్టలు తీసుకుంటుంటే అవీ, సబ్బు తీసుకుంటుంటే దాన్నీ, పైన తువ్వాలు వేసుకుంటుంటే దాన్నీ తండ్రి లాక్కుంటుంటాడు. ఇదంతా మూగిగా సాగుతుంటుంది. అవసరమైన ట్యూనులు వేస్తే అందమొస్తుంది. చివరకు మధు, కాళ్ళకు చెప్పులు వేసుకుంటుంటే- శివరామయ్య అవికూడా లాక్కొని మధు వీపుమీద చరుస్తాడు. తబలా మ్రోగుతుంది]

శివ : (కసిగా) ఎక్కడికీ- ధొరవారి పయనం?

మధు: (కాస్త ఆగి... గంభీరంగా, కొంటెగా) ఆఫీసుకు!

శివ : ఏ ఆఫీసుకు?

మధు: శాంతిరక్షణసంఘం ఆఫీసుకు!

శివ : అక్కడికి వెళ్ళొద్దని ఎన్నిసార్లు చెప్పాను?

మధు: లక్షసార్లు!

శివ : మరెందుకు వెడుతున్నావు?

మధు: దేశంలో శాంతిని కాపాడడానికి.

శివ : ఏడిచావ్! నీకొచ్చే అశాంతిని చూసుకున్నావా?

మధు: ఆ! నాకొచ్చే అశాంతిని గుర్తించే, అది రాకుండావుండేందుకే ప్రయత్నం!

శివ : నోరుముయ్! ఈ చీటీ చదివావా? (చీటీయిస్తాడు)

మధు : (చీటీని బిగ్గరగా చదువుతాడు)

శివరామయ్యకు—

నీ కొడుకు మధుసూదనం ఏదో శాంతిరక్షణ కోసం పాటుపడుతున్నట్టు చూస్తున్నాం. అలాంటిపిచ్చి వేషాలు వేస్తే మీ అగ్రహారం ఎగిరిపోవడమే కాకుండా, మీ పిలక వూడిపోయి, మీవాడిక మీకు దక్కడని తెలుసుకోండి! మూడు రోజులు వ్యవధి నిస్తున్నాం. ఖబర్దార్!

ఇట్లు
హిందూ వీరసర్దార్లు

ఇలాంటి లేఖలు నేనులక్ష చదివాను.

శివ : చదువబట్టేనా - కన్నూ మిన్నూ ఎరక్కుండా తిరుగుతున్నావు ?

మధు : కాదు. వెయ్యి కళ్ళతో కాపాడుకుంటూ తిరుగుతున్నాను.

శివ : అనవసరంగా వాళ్ళతో విరోధం తెచ్చిపెట్టుకోకు. తెల్సిందా ?

మధు : అయితే - మనతో వాళ్ళకు విరోధమెందుకూ ?

శివ : అవును. వాళ్ళ కార్యక్రమానికి అడ్డొస్తే వూరుకుంటారా ?

మధు: అమాయకులనూ, శిశువులనూ హత్యచేసి - సుందర భవనాలు, రమ్య ప్రదేశాలను తగులబెడుతూ - స్త్రీల నవమానపరచుటేనా - వాళ్ళ కార్యక్రమం ?

శి వ : ఆ విమర్శంతా మన కనవసరం.

మధు: ఇంతకూ - మన కేదీ అవసరం ?

శి వ : ఎటూ మాట్లాడకుండా తటస్థంగా వుండడం.

మధు: బుర్రవున్నవాడెవడూ ఈరోజుల్లో తటస్థంగా వుండడు.

శి వ : పిచ్చవేషాలు వేస్తే - వాళ్ళదగ్గర ఆయుధాలున్నాయి తెలుసా ?

మధు: మన కేనా - లేంది ? ఒకవైపు ప్రభుత్వఅండ వుంచుకొని, వెధవగూండాలకు భయపడతామా ?

శి వ : ఏదెలాపోతే మన కెందుకు ? (స్వరం తగ్గింది)

మధు: దేశంలో మనమూ మనుష్యులమైపుట్టాంగనుక;మనకూ, యితరులకూ సంబంధాలుంటాయి గనుక; దేశం బాగుపడితేనే మనమూ బాగుపడతాం గనుక.

శి వ : లేనిపోని కొరివిని కొనితెస్తానంటూ వెందుకురా? పాపం! వాళ్ళిప్పుడు మననేమన్నారని?

మధు : ఇప్పుడు కాకుంటే - మరోవప్పుడంటారు. గూండాలకు పాపపుణ్యాలుకూడా వున్నాయాయేం?

శి వ : (తండ్రి సన్నిధిమాత్రో) నీకిదే గట్టిగా - చెబుతున్నాను. వాళ్ళతో విరోధం తెచ్చిపెట్టుకోబోకు.

మధు : అరవై సంవత్సరాలు పోరాడి, అనేకమంది యువతీ యువకులు తమ విలువైన ప్రాణాలనొడ్డి సంపాదించు కున్న స్వాతంత్ర్యాన్ని కొల్లగొడుతున్న ఆ మండ గీండ్రతో విరోధం కాకుంటే - ముద్దెట్టుకోవాలా?

శి వ : (విసుగెత్తి) ముద్దెట్టుకోకపోతే - వురెట్టుకో వెధవ!

అబ్బాస్ : (చటుక్కున చివరముక్క నందుకుంటూనే ప్రవేశిస్తే అందం. తలకు గాయానికి కట్టిన కట్టు వుండాలి.) ఉరెట్టుకోవాల్సిన పనేమీ లేదు. మన జాతీయ ప్రభుత్వం అసమర్థపుది కాదు. ఈ గుండాయిజాన్ని నిర్దాక్షిణ్యంగా అణిచి పారేస్తుంది. దానికి- మనమంతా తోడ్పడాలి.

శి వ : నీ వొకడివి దొరికావు - మావాణ్ణి చెడగొట్టడానికి. (వాదనకు ఒకరిద్దరయ్యారు)

మధు : ఒకరు, మరొకర్ని చెడగొట్టేదేమీ వుండదు.

శి వ : ఈ సాయిబులేగా-కుట్రలుపన్ని దేశాన్ని చెడగొట్టేది.

మధు : ఎవరో కుట్రచేస్తున్నారని యితన్నంటారెందుకు?

శి వ : ఏం? ఇతను సాయిబుకాడా?

మధు: అవుననుకోండి. ఆ జాతిలో పుట్టినంతమాత్రాన అతనూ దుర్మార్గుడేననడం పొరపాటు.

శి వ : పొరపాటేమిటోయ్? ప్రతి సాయిబూ కుట్రచేస్తూనే వున్నాడట.

అబ్బాస్: మతపిచ్చి మెదడుకెక్కిన మీకేం చెబితే యేం లాభం? తన ప్రభుత్వానికి తలవొగ్గకుండా- కుట్రలతో దుండగాలతో దేశాన్ని నాశనం చేయబూనే దుర్మార్గుడే జాతివాడైతేనేం? హతమార్చి పారేయాల్సిందే.

శివ: కబుర్లకేం లెద్దూ?

మధు: కబుర్లు కాదు. వాళ్ళ నాన్నకూడా దేశ ఐక్యతకోసం, రక్షణకోసమే తన ప్రాణాల నర్పించాడు.

శివ: అదేం ఎత్తో?

అబ్బాస్: మీకు ప్రాణాలర్పించడం కూడా యెత్తుగానే తోస్తే యిక మా వాదన అనవసరం.

శివ: పోనీ- మీ గొడవేదో మీరు చూచుకోకుండా పైగా జమీందారీలు, అగ్రహారాలు పోవాలని అరుపులెందుకోయ్?

మధు: ఒకరు కష్టించేవారూ, మరొకరు భోగించేవాళ్లూ వున్నన్నాళ్ళూ దేశంలో యీ అల్లర్లు తప్పవు. అందుకనే- నిరంకుశులు, దోపిడీదార్లు, జమీందార్లు, పెట్టుబడిదార్లు సంస్థానాధీశులుపోయేదాకా దేశంలో శాంతి లేదుగనుక.

శివ: ఇంకా చెప్పవేం? అగ్రహారీకులు.

మధు: అవును. వారుకూడా.

శివ: అంటె - నీకు నీవే నాశనం చేసుకుంటున్నావన్నమాట. (విషయమంతా తేలిపోయినట్టు)

మధు: పరిస్థితుల కనుగుణ్యంగా నడుచుకోకపోతే నాశనమే గతి.

శి వ : ఏం పరిస్థితులోయ్ ? లేనిపోనివి కల్పించకపోతే చాలు.

అబ్బాస్:ఒకరికల్పన లనవసరం. వారి నిరంకుశత్వమే అన్ని పరిస్థితులకూ మూలం.

శి వ : మీతో వాగితే యేంలాభం ? మధూ ! (భవిష్యత్ అర్థంచేసుకున్నట్టు) నీవాగొడవల్లో పాల్గొనడం నాకే మాత్రం యిష్టంలేదని చెబుతున్నాను.

మధు: అవును. సంగీతపాఠశాలమీద వచ్చిన డబ్బు యిచ్చు కుంటూ, మీరు తిట్టేతిట్లూ, కొట్టేదెబ్బలూ పడ్తుంటే యిష్టమేగాని - నేను దేశంలో శాంతి వుండాలనడం మాత్రం మీ కిష్టంలేదుగదూ !

శి వ : మీరు పనిచేస్తే యేంశాంతి వస్తుందోయ్ ?

అబ్బాస్:కాదు. మీరు చేస్తేవస్తుంది.

శి వ : ఏయ్ ? ఏమిటాకూతలు ?

మధు: నిజంచెబితే నిష్ఠూరంగావుండే కూతలు.

శి వ : ఛూ ! వెధవలు ! (మళ్ళీ మొదలు) ఏం ? ఇంతకూ నీవాపని మానావా ? లేదా ?

మధు: శాంతి చేకూరేదాకా ఎలా ?

శివ : సరే. మీరూ, మీరూ యేయేట్లోనన్నా పడి చావండి. నా కక్కర్లేదు. (నిజంగా వైరాగ్యం కలిగినట్టు లోని కెళ్తాడు)

(మధు తల్లి అరకప్పు కాఫీ మధు చేతికందిస్తుంది)

మధు : (తీసుకొని) మరో అరకప్పు పంపుఅమ్మా! అమ్మా! (వింగులోకి చూస్తాడు)

శివ : (తెరలోనుండి బిగ్గరగా) లేదు ఫోండి గాడిదల్లారా!

[ఉన్న అరకప్పు కాఫీని మధు, అబ్బాస్ చేతికిచ్చి లోనికెళుతాడు. ఇంతలో మరోమూలనుండి శివరామయ్య తిరిగివచ్చి, అబ్బాస్ చేతిలోని కాఫీ కప్పును పగులగొడుతుండగా- మధు, మరో అరకప్పుతో ప్రవేశిస్తాడు. శివ రామయ్య దాన్నికూడా లాగి పగులగొడ్తాడు. మూర్కోపాలు కళ్ళల్లో కన బడుతుండగా ?బ?బా]

— తెర —

-

# నాలుగో రంగం

రెండు మూడు గొందులు కనబడే బజారు

[రఘుపతి, బలరాంలు హాత్యా, వోపిడీలకు నిలుచొని వుంటారు]

రఘు : (వికటంగానవ్వి) కాంగ్రెసువాళ్ళట, అల్లర్లనణిచివేసి- అందరికీ సౌఖ్యం చేకూరుస్తారట, సౌఖ్యం!

బల : వొత్తి మెదడులేని మనుషులు కాకపోతే- యింత పెద్ద జనాభాకు సౌఖ్యమేమిటీఅంటా! కనీసం, సగం జనాభా అయినా తగ్గందేనా?

రఘు : అప్పటికిమాత్రం వాళ్ళేం పరిపాలిస్తార్రా?

బల : అవునుమరి! మనముండగా- వాళ్ళచేతుల్లో యేముంది?

రఘు : (వికటనవ్వి) చేతుల్లోగాదు, గుప్పెట్లోవున్నాయి—ప్రాణాలు.

మన ధైర్యప్రభ జూడ కాంగ్రెసు మహా
మంత్రుల్ భయభ్రాంతులై
ధన మానంబులు దక్కు- టెట్లోయని చిం
తాక్రాంతులై చెట్ల నూ
పిన చందాన శిరాలు పాదములు కం
పించంగ నోర్లేక భూ
మిని జీవించిన చాలు బాబనుచు యీ
మీదన్ ప్రవర్తింపరే.

(వానకాసి)

బల: నిజంగా వాళ్ళగతి అందాకావచ్చినట్టే కనబడుతున్నది. పబ్లిక్ బజారులో మన మిలా చేస్తుంటే- వాళ్లేమూలన నిద్రపోతున్నారో?

(తూని రాగమేదో నెమ్మది నెమ్మదిగా వినిపిస్తుంది. రఘు, బలరాంలు ఆలకించి)

రఘు: ఎవడో తురక వెధవలాగున్నాడు. జాగ్రత్త! (చాటుకు తప్పుకుంటారు.)

(వృద్ధభిక్షుకుడు పాటపాడుకుంటూ ప్రవేశిస్తాడు.)

— పాట —

('వలదే, వలదే, తాలిమికోల్పోవలదే......' మాదిరి.)

బాబూ, బాబూ, బాబూ, బాబూ
ఓ తండ్రీ! దయతో చూడండీ
మా ప్రదేశములు మతకలహములచే
మారణహోమమై మండుచుండెగా ॥ బాబూ॥

తినుటకు తిండీ, తొడుగగ వలువా
ఉండగ కొంపా అసలే లేదూ
అంటుడొక్కలతో అలమటించెడి
ఆర్తుడ నే కాందిశీకుడనయ్యా ||బాబూ||

(వారణాసి)

( బలరాం రఘులు బయటికివచ్చి భిక్షుకుని హత్యచేసి లాగిపారేస్తారు. ఇంతలో సుగర్ డబ్బాగల ఆసామీ వస్తాడు. అతన్ని దోపిడీచేసి డబ్బుకాజే స్తారు. యువకుడు వస్తాడు. ఆతన్ని చిత్రహింస చేస్తారు. వీలున్నవరకు జనులు వస్తూపోతూవుంటే- రఘు బలరాంలు హత్య, దోపిడీ, హింసలు సాగిస్తుంటారు. ఇదంతా మూగిదృశ్యం. ధ్వనులే వినబడుతుంటాయి. జనులురాబోయే ముందు చాటుకు దాక్కోవడం, రంగం మీద కొచ్చాక హఠాత్తుగా పైన బడడం గూండాల మర్యాద. కొంతసేపటికి లీల పాడుతూ ప్రవేశం.)

— పాట —

(అదిగో! అందియలారవళీ... మాదిరి)

వినుమో! ఓ భారతనారీ
వెనుకాడెదేలనోయీ
హత్య, గృహదహనాల్ మనకూ
ప్రాప్తించే కనవో మహిళా
రమ్యంబగు భారతభూమీ
శ్మశాన వాటికయ్యే
నీమనసూ, వ్యథపడదా
కదలీ, ముందడుగూ. వేయీ ||వినుమో||

[ లీలను హత్యచేయడమే వాళ్ళ ముఖ్యకర్తవ్యం కాదు గనక. రఘు బలరాంలు బయటపడి ]

రఘు : (చేతితో అడ్డగించి) ఏయ్ లీలా! (లీల ఉలిక్కి పడు తుంది.) ఎక్కడికీ ప్రయాణం?

లీల : (నీళ్ళు నములుతూ, భయభయంగా) ఇంటికే... ఇంటికే వెళుతున్నాను.

రఘు : ఇటు చూడు! (అతనికేం భయం? లీల గడ్డాన్ని తాకు తాడు)

లీల : (ధైర్యాంవహించక తప్పదు) ఛీ! ఏమిటీ చేష్టలు? నన్ను వదిలెయ్యి!

బల : ఓయబ్బో! ఇంతమాత్రానికే కసురుకుంటున్నావు. ఇక, మా రఘూజీతో ముందుముందు సంసారమెలా చేస్తావు?

రఘు : ఏదో- ఆమాత్రం సిగ్గువుండదటరా!

బల : ఓహో! ప్రణయమన్న మాట. ప్రణయం!




లీల : రఘూజీతో సంసారమేమిటీ?

బల : నిన్ను- మీ నాన్న రఘుపతికివ్వడా?

లీల : ఎవరన్నారామాట?

రఘు : ఒకరనాలాయేం?

బల : అసలు- మాయిష్టాల కొకరి ఆటంకాలుకూడానాయేం? (పిచ్చినవ్వులు నవ్వుతారు)

లీ ల : అసలు, మానాన్న మాటయిచ్చాడా అని!

రఘు : ఇవ్వకుంటే, యేమవుతుందో అతనికి తెలియదూ?

లీ ల : మా నాన్న మీతో పూర్తిగా సహకరిస్తూ నేవున్నాడుగా.

రఘు : నిన్ను - నాకివ్వడంమాత్రం సహకారంగాదూ!
(మళ్ళీ వెధవనవ్వులు)

లీ ల : ఎందుకలా నవ్వుతున్నారు? నాకుభయమేస్తున్నది.

బ ల : రఘు నీవద్దవుండగా భయమెందుకూ ?

లీ ల : అలాగైతే యింకేం ? నన్ను యింటికి వెళ్లనివ్వండి!
(వెళ్లబోతుంది)

రఘు : (ఆపుతూ) వెళ్ళొచ్చులే! కాస్త మాట్లాడివెళ్లూ!

లీ ల : ముందు నన్నువదలండి! (అని, వదిలించుకొని- తుర్రున పరుగెత్తుకొని పోతుంది. బలరాం, వెంటబడి... తిరిగి నిరాశతో ప్రవేశించి)

బ ల : పిట్ట జారిపోయింది గురూజీ!

రఘు : ఆపిట్ట ఎక్కడికిపోతుందిలెద్దూ! (ఇంతలో మళ్లీ పాట వినబడుతుంది)

బ ల : అదిగో! మరేదోపిట్ట వస్తున్నట్టుంది! (చాటుకు తప్పు కుంటారు. ప్రభ - గబగబా చేతిలో పుస్తకాలతో పాటపాడుతూ ప్రవేశం)

— పా ట —

( ధీరే, ధీరే,...ఆరే బాదల్ ధీరే...మాదిరి)

రావో... రావో... రావే - భారతమహిళా రావో...
బాలబాలికలంత నేడూ - హత్యయైపోవా
వృద్ధవనితలుకూడ నేడూ - కత్తికెరయైకి
మానభంగము జరుగుచుండా-
చూచుచుండెదవా ॥రావో... రావో...॥

బల : (తాప్న బయటికొచ్చి ఆపి) ఏయ్ పిల్లా! మాగురువు గారు రమ్మంటున్నారు.

ప్రభ : ఎవడా గురువుగారు ?

రఘు : (కామదృక్కులతో దొరలా ప్రవేసించి) ఎవడా? నీ మగడు! (మీసం మెలివేస్తే బాగు)

ప్రభ : ఏయ్ ఏమిటీ - పబ్లిక్ బజార్లలో వాగుడు!

రఘు : అరికట్టలేకపోయ్యారూ - పాపం!

బల : బజార్లలో యెందుకులే - తిన్నగా లోపలికే దయ చెయ్యి! (ఇగిలింపు)

ప్రభ : ఏయ్ మాటలు సరిగారానీ - తెల్సిందా!

బల : తెలిసింది. ఏదో - నీతో ముందుముందు పనుండబట్టి గాని - లేకుంటే యిప్పటికి...ఏం రఘూజీ! (నీవే సాక్ష్యమన్నట్టు చూపు)

ప్రభ : నాతో, మీకు పనేమిటి ?

రఘు : ఇంకా తెలియనుపిల్లా ! నీకోసం ఈ రఘుపతి మూడు రాత్రులు, నాలుగు పగళ్ళనుండి నిద్రాహారాలు మానేశాడు.

బల : ఇది కాచి వడబోసిన సత్యమని రుజువుచేస్తాను.

ప్రభ : మధ్య నీసాక్ష్యమేమిటీ ?

రఘు : పోనీ నేనే మాట్లాడాలే ! నీకోసం సప్తసముద్రాలు దాటి రమ్మన్నా దాటొస్తాను.

బల : నీకోసం మధుగాణ్ణి పొడిచెయ్యమన్నా - ఏక్దమ్మున పొడిచేస్తాం.

ప్రభ : మితిమీరితే బాగుండదు. నన్ను వెళ్ళనివ్వండి ! (నెట్టుకొని పోతుండగా రఘు నిలేసి)

రఘు : ఏం పోల్లా? ఈ రఘుపతంటే ఎవరో తెల్సా? ఈప్రపంచం బ్రదుకంతా వీడి గుప్పిట్లో వుందని నమ్ము! తలుచుకుంటే- నిన్నూ, నీ సంగీతపాఠశాలనూ, నీ మధునూ, నీ అబ్బాస్‌నూ చివరకు మీా సంఘాలనుకూడా పాత మార్చిపారేస్తాడీ రఘు! బెట్టుసరి యిక్కడేం సాగదు! మహామహా పతివ్రతలకే అలవికాలేదు. వాళ్ల దృష్టిలో నీవో కీటకానివి !

(ప్రభను బలవంతం చేయబోతాడు. ప్రభ కత్తిలాగి పొడవబోతుంది. బలరాం కత్తిని లాక్కుంటాడు. ప్రభ చేసేదేమీలేక కేకలేస్తుంది. అబ్బాస్,

మధులు లాఠీలతో వస్తారు. ఇరుపార్టీలకు బ్రహ్మాండమైన పోరుసాగుతుంది. గూండాలను వెళ్ళగొట్టేస్తారు. (ప్రభ రక్షింపబడ్డాక, పాటపాడుతుంది.)

— పాట —

స్వేచ్ఛనందినా భారతభువిలో
దుండగీండ్రోయీ — సోదరా
వెలసిరి కనుమోయీ ॥స్వేచ్ఛ॥
అడుగడుగున మన దేశోన్నతినీ
అడ్డగించు ఈ చీడపురుగులను
అరికట్టాలోయీ — మనమే
అరికట్టాలోయీ ॥స్వేచ్ఛ॥
శాంతి సౌఖ్యముల కాపాడెడి మన
ప్రతిభను చాటగ ప్రజాప్రభుత్వమును
కాపాడాలోయీ — సోదరా
కాపాడాలోయీ ॥స్వేచ్ఛ॥

— తెర —

# అయిదో రంగం

## శాంతిరక్షణసంఘ కార్యాలయం

[వెనుకభాగాన జాతీయ నాయకుల పటాలు,నినాదాలు వ్రాసిన అట్టలు, కర్రలు, లాఠీలు, (వీలుంటే ఆయుధాలు) జాతీయ పతాకాలు—

ముందుభాగాన డ్రెస్సులో వాలంటీర్లు. వారికి మార్చింగ్ సాంగ్ చెబుతున్న అబ్బాస్, మధులు కమాండర్ల దుస్తులలో. రంగస్థలానికిముందు "శాంతి రక్షణసంఘ కార్యాలయం" బోర్డువుంటే మంచిది. మధు పాటచెబుతుంటే- కదం త్రొక్కుతూ ఒకే ఫక్కిన వాలంటీర్లు అతిఉత్సాహంగా చదువుతారు]

— పాట —

శాంతినొసగు వీరులం - క్షామబారి వైరులం
జాతి మతము లెంచనట్టి - సామ్యవాద నేతలం
దుండగీండ్ర పణచెదం - దూకెదం మహాగ్నిలో
మతకక్షల రూపుమాపి - మంచితనము కూర్చెదం

జాతీయ ప్రభుత్వమున్ - ఖ్యాతి తరుగకుండగా
ఎల్లవేళలందు మేము - అండగాను నిల్చెదం
మూడురంగుల బావుటా - ముందునిలిచి పోరెదం
దేశంబున శాంతిగూర్చు - ధీరులైన వీరులం
॥శాంతినొసగు॥

(వారణాసి)

(పాటపూర్తవుతుండగా కొందరు ప్రజలు అదుర్దాగా పరుగెత్తుకుంటూ వచ్చి- "అల్లర్లు మళ్ళీ చెలరేగాయి. దోపిడీలు జరుగుతున్నాయి. హత్యలు సాగుతున్నాయి. ఇండ్లు తగులబడుతున్నాయి. అయ్యా! తొందరగా రావాలి, రక్షించాలి"- ఒక్కపెట్టున మొత్తుకునేసరికి మధు విజిల్ వేస్తూ- పాటను ఆపుచేస్తాడు. Form in a line అంటాడు. వాలంటీర్లు ఖచ్చితంగా ఆయుధాలతో నిలుచుంటారు Slow March అన్నాక- అబ్బాస్, మధులతో సహా బయటికి వెళ్ళిపోతారు

భయంకరధ్వని. బయట గొడవలు జరుగుతున్నట్టుగా "కొట్టండి, చంపండి, నరకండి, చంపండి, పట్టుకోండి"- అనే అరుపులు బిగ్గరగా ఒక క్రమప్రకారం వినపడాలి....కొంతసేపటికి అబ్బాస్ - చేతిపై కాయుతున్న గాయంతో బాధపడుతూ, నీరసంగా క్రాఫంతా చెదిరిపోయి, కంగారుగా, విచారవదనంతో గాయం తగిలిన చేతిని నొక్కి పట్టుకుంటూవచ్చి రంగస్థలంపై పడిపోతాడు. విచారాన్ని సూచించే ట్యూన్స్ ఇవ్వాలి. బ్యాక్‌గ్రౌండున పాట వినబడుతుంది. ఆపాట వినబడుతున్నప్పుడు మధు వచ్చి- అబ్బాస్ చేతి గాయాన్ని చూచి కట్టుకడతాడు. కాఫీ యిస్తాడు. లేవనెత్తుతాడు. పాట వినబడుతున్నంతసేపూ అక్కడ అవసరమైన మూగ కార్యక్రమం సాగుతూ వుండాలి)

— బ్యాక్‌గ్రౌండ్ పాట —

శాంతికోసమని - తపియించెడు ఈ
జ్ఞానవంతులకు ఆపదలా - దేవా - ఆపదలా
తమ సర్వస్వము దేశోన్నతికే-
అర్పించిన ఈ త్యాగజీవులకు
గాయములా - దేవా - గాయములా
విశ్వమానవ - సౌఖ్యముకొరకే-
పాటుపడెడిమన - పావనమూర్తికి
గండములా - దేవా - గండములా ॥శాంతికోసమని॥

మధు: (అబ్బాస్‌ను లేవనెత్తి) మేం, గస్తీకెడతాంగదా! ఇక్కడెవరూ లేరయ్యో! మనయింటికి వెళదాం రారాదూ అబ్బాస్!

అబ్బాస్:(నవ్వి) ఇంతమాత్రానికే భయపడుతున్నావా మధూ! ఏంపర్వాలేదు. నయమయిపోతుందిగాని వాలంటీర్లతో జాగ్రత్తగామాత్రం గస్తీతిరుగు!

మధు: మా జాగ్రత్తలకేంగాని— నీవుమాత్రం మెలకువగా వుండాలి.

అబ్బాస్:నాకేంభయం? వాళ్లముండ! ఇకవాళ్లురారులే! అప్పుడే చచ్చాననుకొని వుంటారు.

మధు: సరె వెళ్లొస్తాము, లేచి తలుపుపెట్టుకో!

[ మధు వెళ్ళిపోతాడు. అబ్బాస్ తలుపువేసి వచ్చి పడుకుంటాడు. నిద్రపడ్తుంది... కొంత సేపటికి... (ప్రమాదాలను సూచించే విచారమైన ట్యూన్ని వేయాలి... నల్లటి ముసుగొకటి అబ్బాస్ను పొడవడానికి అడుగులో అడుగు వేసుకుంటూ వస్తుంది. ముసుగుకు కనబడకుండా నక్కుతూ, నక్కుతూ లీల వెంబడిస్తుంటుంది.

సరిగ్గా కత్తిని ఎత్తేసరికి- చప్పున లీల ఆ కత్తిని పట్టుకుంటుంది. ఇద్దరూ పెనుగులాడ్తారు. చప్పున అబ్బాస్ లేచి- లీల చేతిలోని కత్తి తీసుకొని ముసుగువాణ్ణి పొడిచేస్తాడు. ముసుగువాడు పడిపోతాడు. అబ్బాస్ నిర్విణ్ణుడౌతాడు. లీల, అబ్బాస్లు పెద్దనిట్టూర్పు విడిచాక)

అబ్బాస్ : (గద్గదికంగా) లీలా! (అంటాడు)

లీల : అబ్బాస్! అన్ని విషయాలూ తర్వాత చెబుతాగాని ముందీశవాన్ని అయిపు లేకుండా చేసెయ్యాలి!

(ఇద్దరూ శవాన్ని మోసుకెళుతుండగా)

— తెర —

# ఆరో రంగం

## సేఠ్జీ యిల్లు

(బల్ల, రెండు కుర్చీలు, ఒకమూలన పెద్ద గాంధీవిగ్రహం. రఘుపతి, బలరాం పోయాడన్న విచారంతో)

— పాట —

క్రూరమనుజులా బారినపడి మమూ
వీడిపోయినావా—బలరాం—వీడిపోయినావా
మనసంఘానికి మహామాన్వితుడని
నమ్మియుంటిగదరా—బలరాం—
నమ్మియుంటిగదరా ||క్రూర||

(సేఠ్జీ ప్రవేశించగానే)

రఘు: పెద్దమోసంజరిగిపోయింది సేఠ్జీ! బలరాం మనకికకనబడడు.

సేఠ్జీ: బలరామా! మన వీరబలరాం! అతన్ని హత్య... ఛీ! అపశకునం! అసలేమైంది రఘూ?

రఘు: బహుశా హత్యే అయివుంటుంది. ఇంతవరకూ అయిపు లేదు. నిన్నరాత్రి అబ్బాస్ పనిపట్టడానికి వెళ్ళాడు. అక్కడేం జరిగిందో తర్వాత అతను తెలియదు.

సేఠ్జీ: ఒక్కణ్ణే ఎందుకు పంపావు రఘూ?
రఘు: మాంచి వీలుగా వుందన్నాడు. ఇతరుల సహాయమే అక్కర్లేదని ధైర్యంగా వెళ్ళాడు.
సేఠ్జీ: అబ్బాస్‌గాడే చంపాడంటావా?
రఘు: ఏమో—చెప్పలేను. అయితే వాడికా సాయంత్రమే చేతిమీద గాయమైంది. బహుశా, బలరాంను చంపేటంతటి ఓపిక వుండి వుండదు.
సేఠ్జీ: మరెలా మాయమయ్యాడంటావు?
రఘు: అదే తోచకుండా వుంది. ఎలాగో బాధతోనైనా అబ్బాసే చంపడమో, మరొకరెవరైనా వెన్నంటి వుండడమో జరిగివుంటుంది.
సేఠ్జీ: ఆ శాంతిరక్షణ దళంవాళ్ళూ, ప్రభుత్వమూ తీవ్రంగా పని చేస్తున్నట్టుంది.
రఘు: అవును. వాళ్ళకే మన బలరాం బలయ్యాడు
సేఠ్జీ: చాలా జాగ్రత్తగా మెలగాలని నేను చెప్పలేదు రఘూ!
రఘు: మహా చెప్పావు - వొద్దున కూర్చొని. చచ్చిపోయ్యే వాళ్ళం మేమూ. బ్రతికుండేది నీవూనా?
సేఠ్జీ: ఏం? ఇవేళిలా మాట్లాడుతున్నావేం రఘూ?
రఘు: కాకుంటే యేమిటి మరి? వచ్చిన ఆస్తిలో నీకు సగం యివ్వాలిగదూ! ఎందుకనేం?
సేఠ్జీ: నేను ఆయుధాలు సప్లయిచేయడంలేదూ?

రఘు : అవును. సమయాని కంమతున్నాయి గనుక.

సేఠ్జీ : మరక్కడినుండి రావద్దటోయ్ ?

రఘు : మనమంతా చచ్చిపొయ్యాక వస్తాయికదూ ?

సేఠ్జీ : తొందపడితే యెలారఘూ? అయితే మీరు హిందువులనుకూడా చంపుతున్నారట నే?

రఘు : లేకుంటే నీకీడబ్బు ఎలావస్తుందనుకున్నావ్?

సేఠ్జీ : అయితేమాత్రం! మనవాళ్ళనే చంపడం....

రఘు : పాపం!ఏం దయ! ఒకప్రక్క డబ్బుకావాలి, శత్రునాశనంకావాలి. మరోప్రక్క మనవాళ్ళంటూ కన్నీరు కార్చాలి. వా! మీ వ్యవహారం చాలా బాగుంది సేఠ్జీ! అల్లరు రేపడమూ మీవంతే. ఆపమనడమూ మీవంతేనా?

సేఠ్జీ! అయితే_ మరి, మా అమ్మాయి నేమో....

రఘు : ఓస్! ఇంతేనా? మీ కూతురును ముద్దెట్టుకునేహక్కు కూడా లేదంటవా సేఠ్జీ! (నిర్లక్ష్యంగా, ఆగకుండా చరచరా వెళ్తాడు. సేఠ్జీ ఆశ్చర్యంగా నోరు తెరచేసరికి)

లీల : (ప్రవేశించి, చిరునవ్వుతో) ఏం నాన్నా? రఘుపతి ఏమంటున్నాడు?

సేఠ్జీ : (సవరించుకొని, నీళ్లునములుతూ) ఆ.. ఆ... ఏముందీ? ఏదో బలరాం పొయ్యాడన్న విచారంలో అలా దురుసుగా మాట్లాడాడేగాని...

లీల : (సీరియస్‌గా) అలాగా! నీవొక త్రాచును పెంచుతున్నా వని తెలుసుకుంటున్నావా నాన్నా!

సేత్జీ : అంతమాత్రానికే త్రాచనుకోవడం భ్రమ! చూడు! పాపం! వాళ్లు హిందూ సామ్రాజ్యంకోసం తమ ప్రాణా లనుకూడా అర్పిస్తున్నారు. వారి త్యాగాన్ని మన మెంతగా కొనియాడాలి!

లీల : నాగరికతనంతా నాశనం చేసి, శ్మశానవాటికను పరిపా లించే మీ సామ్రాజ్యం ఏ హిందూకూ అక్కర్లేదు.

సేత్జీ : నీకు లోకజ్ఞానము తక్కువ ఊరుకో లీలా !

లీల : మానవులందర్నీ మటుమాయంచేసి - తినతిండి, కట్ట గుడ్డ లేక భిక్షమెత్తుకొనే పరిస్థితికి తేవడం లోకజ్ఞానం వుండేకదూ !

సేత్జీ : అసమర్థప్రభుత్వం చేయలేనిపని మేంచేస్తున్నాం.

లీల : మైనార్టీవర్గాన్ని దగ్ధంచెయ్యలేదనేగా - మీ కోపం!

సేత్జీ : అవును. ముస్లింలంతా హిందువులను నరికిపారేస్తుంటే- నోరుతెరిచి కూర్చొమ్మంటావా ?

లీల : పాపం! హిందువులంటే ఎంతసానుభూతి !

సేత్జీ : అవునూ వాళ్లు మన సోదరులు.

లీల : నిజమే కనబడ్తూనేవుంది- మన సోదరప్రేమ. ప్రభుత్వా నికి తెలుసు- ఎవరినిరక్షించాలో, ఎవరినిశిక్షించాలో ! మధ్య మీగొడవలెందుకూ ?

సేఠ్జీ: దాసికి చేతగాదనే.

లీల : అంత దయగలవారైతే ప్రభుత్వానికే సాయపడండి! అవసరమైతే మీ సాయంతో - ప్రభుత్వమే యుద్ధం ప్రకటిస్తుంది. కాని- మీరే, తిరుగుబాటుచేసే ద్రోహ బుద్ధెందుకూ ?

సేఠ్జీ: నీతీ, జాతీ, మతమూ లేని ప్రభుత్వమ్మీదికి తిరుగు బాటా? ఇంకా నామరూపాలు లేకుండా చేయాలా?

లీల : అడియాసలకు పోబోకునాన్నా! ప్రజాప్రభుత్వాన్ని నాశనం చేయగలగడం దుర్లభం! నామాట విను నాన్నా. నీకింత మతద్వేషం పనికిరాదు.

సేఠ్జీ: నీ బోధలు నాకేమీ అక్కర్లేదు.

లీల : నీ కూతురును నాన్నా!

— పాట —

మరణించుచుండిరోయీ – మనసోదరుల్ అనేకుల్
కులభేద మేలనోయీ – కనవోయి, నాగరికతన్
జనులెల్ల నీసువారే – చరియింపు, సత్పథానా
అన్యోన్య సౌజనత్వం – అదుగంటె నేడు యిలలో
కనుమా, కనుమా – ఈ ఘోర మారణాలు
పశుజాతికన్న నీచం – పరికింపగొప్ప ఘోరం
తమలోన తామెమరచి – దుష్కృత్యములకు గురియై
కళకళల్ చిందు భవనాల్ – కాల్చుండె, గగనమంటి

సోదర ప్రజల చంపి – శ్మశాన భూమిచేసే
ఆనంద మేమిటోయీ, ఆనంద మేమిటోయీ–
ఆనంద, మేమి, టోయీ...

(నాయకా సి)

సేఠ్జీ : (పెడముఖం) అనవసరంగా కోపం రానివ్వకు లీలా! నేను ముస్లింలనందరినీ నాశనం చేసి తీరుతాను.

లీల : (కళ్ళల్లో నిప్పులు గ్రమ్ముతూ ?) వాళ్ళ క్రూరత్వాన్ని నాశనం చేయాలిగాని – వాళ్ళ జాతినంతటినీ నాశనం చేయడానికి నే నెప్పటికీ వొప్పుకోను.

సేఠ్జీ : (After all అన్నట్టు) నీవేం చేయగలుగుతావని ?

లీల : మంచితనంగా నీకున్నంతే ప్రతిఘటిస్తాను. సోదర సోదరీ మణుల హత్యల నరికడతాను. క్రూరత్వాన్ని నాశనం చేస్తాను. దుండగీండ్ర నణిచివారేస్తాను. నాగరికతను కాపాడాను. మానవలోకాన్ని ఆదర్శపథంలో నడిపిస్తాను. పెట్టుబడిదారీ విధానాన్నీ, నిరంకుశత్వాన్నీ మంటగలిపి ప్రజారాజ్యాన్ని స్థిరపరచడానికి ప్రాణాల నర్పిస్తాను.

సేఠ్జీ : అన్నివిషయాల్లోనూ నాకు వ్యతిరేకిస్తున్నావని తెలుసుకో లీలా !

లీల : అవును. మీకూ, నాకూ అభిప్రాయాలు కలువకపోవడమే వ్యతిరేకం.

సేట్జి : పసికూనవు. బాధ్యత నెరుగకుండా ప్రజారాజ్యమని వాగుతున్నావు!

లీల : అవును. మన ఆస్తిపాస్తులు, ఫ్యాక్టరీలు ఎగిరిపోతాయనినాకు తెలుసు. అప్పుడే శాంతివృందనికూడా నమ్ముతున్నాను కనుకనే.

సేట్జి : నీవు ఎవరితో మాట్లాడుతున్నావో మరిచావా లీలా ?

లీల . చిన్నప్పటినుంచి పెంచి పెద్దచేసిన తండ్రితో, మధ్యలో దేశాన్ని నట్టేటముంచిన పెద్దమనిషితో, సోదర ప్రజానీకాన్ని అర్థంలేని హత్యలకు గురిచేస్తున్న క్రూరునితో, బీదప్రజల రక్తమాంసాలపై భవనాలు నిర్మించిన పెట్టుబడిదారునితో, దేశభక్తికణాలు వుబుకుతున్న కన్నకూతురు నోరుమూయనరికట్టిన పురుష పుంగవునితో.

సేట్జి : లీలా! ఈ సమయంలో నీవిలా మాట్లాడడం యెంత ప్రమాదమో ఆలోచించుకో !

లీల : ఆలోచించుకొని, ఆలోచించుకొని, సహించి, సహించి మనసులో కుమిలి, కుళ్ళి యిప్పుడు పట్టలేక బయట పడుతున్నాను. జరిగే ప్రమాదా లెలాగూ జరుగనున్నాయి. తప్పదు.

సేట్జి : రేపో, మాపో పతనమయ్యే ప్రభుత్వాన్ని నీవు బలపరచకు లీలా ! మంచిదికాదు.

లీల : ఉడతపూపులకే రాజ్యాలు కూలిపోయ్యేట్టుందే మీ ధోరణి ! ఇక మీరు రఘుపతి చేతినుండి బయటపడితే రాజ్యాలు గెలిచినట్టే.

సేఠ్జీ : (ఎంత అర్థంలేనిమాట - అన్నట్టు) నీవేమైనా స్వప్నావస్థలో వున్నావా లీలా !

లీల : అవును. డబ్బుకోసం హిందూమత సామ్రాజ్యంకోసం కలువరించే కలువరింతల్లో మీకు నా స్వప్నజగత్తె కనబడడంలేదు. దయ, సానుభూతి మానాభిమానాలకు సున్నచుట్టేశావు.

సేఠ్జీ : నీవాగుడు విపరీతమవుతున్నది లీలా !

లీల : త్రాచులా పొంచిన రఘుపతి సన్నవమానపరిస్తే నోరు లేదు గాని - నీతివాక్యాలు బోధించే నా మాటలు విపరీతం కదూ ?

సేఠ్జీ : నీవే నాపాలిటి కాలత్రాచువవుతున్నావు సుమా!

లీల : నేను త్రాచునుకాను, నీ కూతురును.

సేఠ్జీ : నాకు వ్యతిరేకించే కూతురుతో నాకేం పనిలేదు. పో! ఎటైనా వెళ్ళిపో!

లీల : అంతంతమాత్రానికే వెళ్ళే ఘటంకాదీ లీల.

సేఠ్జీ : ఛీ! పాడుముండవు. మరీ ప్రేలుడెక్కువైంది. (ఒక్క తన్నుతంతాడు. లీల గాంధీవిగ్రహంపైపడుతుంది. విగ్రహం విరిగిపోతుంది. కన్నీరు కారుస్తూ)

లీల : ఈ లోకానికి శాంతి లేదా బాపూజీ! శాంతి కోసం ప్రాణాలుకూడా వదిలావా మహాత్మాజీ!

— పాట —

శాంతిలేదా ప్రశాంతహృదయా
భారతికీ, నరకమే, తిరమానా ॥శాంతి॥

మతసిద్ధాంతము ప్రమాదకరమని
బోధించిన మా పూజ్యబాపూ
విడిచితివా మము శోకాగ్నులలో
నడచితివా స్వర్గసీమలకు ॥శాంతి॥

రక్తపిపాసులు రాక్షసిమూకలు
మతోన్మాదులే మాయం జేసిరా!
కనపడవా — గాంధీజీ
మనగలమా — నిను వీడి ॥శాంతి॥

కుల మత తత్వము తలెత్తనీక
ఇల సమత్వమును గూర్చెదము; నీ
అడుగుజాడలనె అనుసరించెదము
ఆదర్శంబుల నిల్పెదము ॥శాంతి॥

(శ్రీరామకవచం)

— తెర —

–

# ఏడో రంగం

## శివరామయ్య యింట్లో గది

[మూడో రంగంలోవలె గది అలంకరింపబడివుంటుంది. మధు-ప్రభకు హార్మోనియంపై పాట నేర్పబోతుంటాడు]

ప్రభ : ఇవేళ- ఈ క్రొత్తపాట నేర్పండి! (పత్రికొకటి చేతికిస్తుంది)

మధు : (తీసుకుంటూ) ఎవరు వ్రాశారీపాట?

ప్రభ : మన లీల వ్రాసింది.

మధు : కవిత్వంకూడా వస్తుందా యేం?

ప్రభ : (ఏదో అంతరార్థం వేరేవున్నట్టు) అందుకనే........
(యిద్దరూ నవ్వుకుంటారు)

మధు : ఆఁ, పాటకానీ...

— పాట —

(ఆంఖియాఁ మిలాకె, జియాభర్ మాకె...మాదిరి)

ప్రేమ మయంబీ, జీవితనౌకా-ప్రేమయె ముఖ్యముగా...
ప్రేమయె ముఖ్యముగా

ప్రేమపథానా నడిచే – మనకడ్డే లేదీ జగతిన్
త్యాగానికి మూలంబైనా–ప్రేమే–గమ్యస్థానముగా...
॥ప్రేమమయంబీ॥

ఆనందపు సాగరమందూ – హాయిగా తేలిపోదాం
కష్టాలను సుడిగుండాలను–దాటే–ధైర్యముతోడనుగా
॥ప్రేమమయంబీ॥

(వారణాసి)

ప్రభ : (పాట ఆపాక) ఏమండీ! రోజురోజూ బక్క–చిక్కి–పోతున్నారేం ?

మధు: బలిసి ! (చిరునవ్వు)

ప్రభ : (పట్టరానినవ్వు) బలేగావుంది సమాధానం !

మధు: ఏం ? బలిపించే మందేదైనా వెయ్యరాదూ ?

ప్రభ : అలాగా ? అయితే- నోరుతెరువండి ! (ఏదో జ్ఞప్తికొచ్చినట్టు సంచినుండితీసి- మధు నోట్లో వేస్తుంది. కొంతసేపు నవ్వులయ్యాక)

మధు: నీ చిలిపిచేష్టలు మానావుకావేం ప్రభా ?

ప్రభ : మీరు మానారుగనుకనా- నన్ననడానికి !

మధు: నేనంటే మగధీరుణ్ణి !

ప్రభ : ఓహో ! ధ్రువతిమించుతోంది ! నేను వీరాంగనను సుమా ! (బాకులాగి, సీరియస్‌గా నిలుచుంటుంది)

మధు: (ఏదో పురుగు తొలిచిందా ?) ఎన్నో తుపానులు చెల రేగి, అల్లకల్లోలమవుతున్న నా హృదయానికి నీ చిలిపి చేష్టలు సంతోషాన్నిస్తాయి ప్రభా !

ప్రభ : అయితే- ఆపెయ్యమంటారా, చెప్పండి !

మధు: వద్దు ప్రభా ! వద్దు ! నిన్ను చూడకుండా నే నెలా బ్రతకడం ?

ప్రభ : అసలు నేనిప్పుడెక్కడికి వెళుతున్నానని- మీ భయం !

మధు: ఇవేళ కాకుంటే రేపు. ఎప్పుడైనా మీవూరు వెళ్ళే దానివేగాని- ఈ సంగీతంతో నీకేంపని ?

ప్రభ : ఒక్క సంగీతంతోనైతే ఎలాగూ వెళ్ళేదాన్నేమో గాని...

శివ : (అప్పటినుంచెక్కడ వున్నాడోగాని - ఈ ప్రభమాట పూర్తికాకముందే హడావుడిగా ప్రవేశించి) ఎలాగూ వెళ్ళేది లేదా ?

మధు: ఏమిటి మీ ఆదుర్దా ?

శివ : నీ మూలంగా ఆదుర్దా ! ఆ సాయిబు ముండాకొడుకు నిన్నెంత పాడుచేస్తున్నాడో - యిదికూడా అంతే పాడు చేస్తున్నది.

ప్రభ : ఏం ? కొడుకును ఋష్యశృంగునిగా తయారు చేద్దామనా !

శి వ : నోరు ముయ్. ఏరా వెధవా! నీ వాఫీసు పనులు మానుకొమ్మంటే మానుకోవుగా?

మధు: మళ్ళీ మొదలా యేమిటి? ఇదివరకెన్నిసార్లు చెప్పాను. అయితే - మూడురోజుల్లో నా పని పడ్తామన్నవాళ్ళ చీటీవ్యవహారమే మైందో పాపం! మరిచిపోయ్యారో!

ప్రభ : వాళ్ళ బొంద. ఇంకా ఏంచేస్తారు? ప్రజలంతా వాళ్ళనే తన్నడానికి తయారవుతుంటే.

శి వ : నీకూ రాజకీయాలు కావాల్సివచ్చాయే?

మధు: స్త్రీలుకూడా పనిచేయబట్టే - కార్యక్రమం సవ్యంగా సాగుతున్నది.

శి వ : ఇదిగో: ఎప్పుడో ఒకప్పుడు వాళ్లు నీపనిపడ్తారు వెధవ!

మధు: ఇలా ఎన్నాళ్లు బెదిరిస్తారండీ? కానీండి. ఎప్పుడో ఒకప్పుడు ఫైసలా కావల్సిందేగా!

శి వ : ఛీ ఛీ! అన్నివిధాలా నా పరువును పాడుచేస్తున్నావు గదా!

మధు: మీ పరువును పాడుచేస్తున్నానా? నా ప్రయత్నమంతా మీ పరువును కాపాడడానికే.

శి వ : అయితే, యీ సంగీతపాఠశాల మూసెయ్యమనలే.

ప్రభ : దానిమీదవచ్చే డబ్బుకావాలిగాని...

మధు: అయినా, పాఠశాల మీ పరువుకేం అడ్డువచ్చిందండీ?

శి వ : అగ్రహారీకుని కుమారుడు సంగీతపుబడి పెట్టుకున్నా డంటే ఎంత అవమానం!

మధు: ఇంట్లో కుళ్ళి, ముర్గి చస్తే అవమానం కాదు. తన్నులు తింటుంటే అవమానం కాదు. కాని- స్వతంత్రంగా బడి పెట్టుకోవడం అవమానం కదూ!

శి వ : (పాపం!) అసలు మన కెందుకురా యీ బళ్లూ, యితర వృత్తులూ?

మధు: అవును. దేశం ఎలా నాశనమైపోతే మన కెందుకు? పొరుగువాళ్లు చస్తుంటే మన కెందుకు? నేర్చుకున్న సంగీతాన్ని సాధనచేసుకోవడం మన కెందుకు? ఇక ఏది కావాలో చెప్పకూడదూ?

శి వ : (ఇంతేనా నీ తెలివన్నట్టు) ఏంకావాలేమిటోయ్? హాయిగాతిని - కాళ్లు బారచాపేంత ఆ సిపాస్తు లున్నాయి. వ్యవసాయం చేయించుకోకూడదూ?

ప్రభ : ఇంత అనుభవం సంపాదించి, మీరు పండిస్తున్నారుగా పుట్టకొద్దీ. ఇక వారు పండిస్తారు.

శి వ : మధ్య నీ సమాధానాలు వద్దనలే ?

మధు : వద్దనుకున్నా- ప్రభ సమాధానం చాలా బాగుంది. నిజ మంతేగా? మనం వ్యవసాయం చేయించేవాళ్ళమేగాని- స్వయంగా చేసుకునేవాళ్ళం కాముగా!

శి వ : అవునూ! శుభ్రంగా చేయించుకోవచ్చు.

మధు : ఇకముందు చేయించుకునే రోజులు పొయ్యాయి. మన్నే వానికేభూమి. అందుకని, మనకు మన్న చేత కావద్దూ?

శివ : (విసుగెత్తాడా?) చేతకాకుంటే చావు వెధవ! నేనేదో బాగుపడేమార్గం చెబితే!

ప్రభ : వాడికి వ్యవసాయం చేసుకోవలసిన పనీ లేదు - మీరు బాగుపడేమార్గం చెప్పనూ అక్కర్లేదు! అందుకనే సంగీత పాఠశాల పెట్టారు.

శివ : పానకంలో పుడకలాగ - మధ్యమధ్య నీ వాగుడేమిటి?

మధు : అన్నను మరి. వ్యవసాయం చేతగానివాళ్ళంతా యితర వృత్తుల్లో చేరాలి. తప్పదు.

శివ : ఎక్కడివిరా ఈ పాడుసిద్ధాంతాలు? ఎవరు నేర్పుతున్నారో? అందుకనే దేశం నాశనమవుతున్నది.

మధు: దేశం నాశనమవుతున్నది సిద్ధాంతాలవల్లకాదు. ఒకరు కష్టించేవారు, మరొకరుఅనుభవించేవారు వున్న విధానం వల్ల. అందుకనే- కొద్దిరోజుల్లో మార్పులు జరుగబోతున్నాయి.

శివ : పనిలేని మనుషులంతా చేరి ఏవో మార్పులు తెస్తూనే వుంటారు. వాళ్ల దేంపోయింది.

ప్రభ : పని లేని మనుషులెవరో తెలుస్తూనేవుంది.

శివ : ఎవరూ-పని లేనిమనుషులు?

ప్రభ : ఎవరో- అగపడడంలా?

శివ : ఏమిటా పిచ్చికూతలు ?

మధు: పోనిద్దురూ ! మీపనేమిటో మీరుచూసుకోండి !

శివ : ఏం నంగనాచివిరా ! దాన్ని వెనకేసుకొని యిలా మాట్లాడ్తావుకదూ ! (పళ్లుబిగించి, కోపమెక్కువై పైపైకివెళ్లి మధును కొట్టబోతే ప్రభ అడ్డగించి)

ప్రభ : ఎందుకండీ- ప్రతిరోజూ మీ రాయనగార్ని యిష్ట మొచ్చినట్టు కొడ్తారేం ? ఏదో- మీ పరువు నాలో చిస్తున్నారుగాని, తిరగబడితే యేంగావాలి ?

మధు: ఏమవుతుందో వారికేం తెల్సు ? వారివాళ్లు కాదుగా ! ఇదే చెబుతున్నాను. మీ పరువు పోదనుకుంటేనా— జాగ్రత్తగా యింట్లోవుంచుకోండి ! లేదా-ఆస్తినిపంచి, బయటికి పంపండి ! ఏందుకీ గోల ?

శివ : పోరా వెధవా! ఏ పోకిరీలలోనన్నా కలువు! నాకేం?

ప్రభ : మీకేమీ లేందేనా- యింతగా ప్రేలారు?

శివ : నీకూ పొయ్యేకాలం దగ్గరికొచ్చిందిలే ! మీనాన్నకు వుత్తరం(వ్రా)శాలే! రేపోమాపో వచ్చితీసుకెడతాడు లే! (చిర్రుబుర్రులాడుతూ లోనికెడతాడు)

ప్రభ : ఇంతేగదా-మీ ప్రతిభ! (హార్మోనియంపై హుషారుగా)

— పాట —

('జీవన్ కే నావ్ న డోలే......' మాదిరి)

ఎన్నాళ్ళీ సోమరితనమూ
కష్టపడీ - భూమిదున్నాలీ ॥ఎన్నా॥
పెత్తనము చేయు దినాలు
ఏనాడో - సమసిపొయ్యాయి
కాలానుగుణ్యముగాను
పరిస్థితుల - మార్చుకోవాలీ ॥ఎన్నా॥

(పాట అయిపోతుండగా)

— తెర —

—

# ఎనిమిదో రంగం

## మీటింగు స్థలం

(తెర ఎత్తేసరికి లీల అధ్యక్షపీఠం. ఒకప్రక్క మధు కుర్చీలో. మరో ప్రక్క అబ్బాస్ నిలుచొని)

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్!
స్వంతలాభం కొంత మానుక
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్!

(గురజాడ)

సోదర-సోదరీమణులారా!

మనం ఈనాడు దేశంలో జరుగుతున్న అల్లర్లను సిగ్గు పడడంకాదు. అసలు లోకంలో జరుగుతున్న అన్యాయాలకే తలలు వంచుకోవలసి వస్తున్నది.

ఏమంటే మనమంతా మానవులమని, నాగరికులమని పిలువబడుతున్నాం. కాని మనమే మనలాంటి మానవులను, మనలాగా అవయవాలన్నీ సవ్యంగావున్న మన సోదరులనే కాందిశీకులుగా, భిక్షగాండ్రుగా వెళ్ళగొడుతున్నాం.

ఇప్పటికే దేశంలో ధనిక బీదవర్గాలున్నాయి. ఒక ప్రక్క ధనవంతులు తెల్లబట్టలు వేసుకొని పెద్దపెద్ద ఉద్యోగాలు చేసుకుంటూ, పొట్టలు పగిలేటట్టు తింటూ, సినిమాలు చూచుకుంటూ, రేడియోలు వినుకుంటూ ఎత్తైన భవనాల్లో హాయిగా, కాలుమీద కాలువేసుకొని పదిమంది భార్యలతో సరససల్లాపా లాడుతుంటే—

మరోప్రక్కనే సూర్యచంద్రాదులు కాపురంచేసేపూరి. గుడిసెలు మనలాంటి మానవులవే ఉన్నాయి. వారికి తినతిండి లేదు. కట్టబట్ట లేదు. చదువు సంధ్యలు లేవు. రోగాలొస్తే మందుల్లేవు.

ఏమిటీ మానవజాతిలో విభేదాలు ? ఎటుపోతున్నదీ లోకం ? ఆదర్శవంతమైన దనుకుంటున్న మన భారతభూమిలో కూడా ఈ వ్యవస్థ వుంది. అయితే యితర సామ్రాజ్యవాదులను, నిరంకుశులను, పెట్టుబడిదారులను, స్వార్థపరులను మనం తిడుతున్నాం. వారి విలాసాలను విమర్శిస్తున్నాం. వారు బానిసల నమ్ముతున్నారని ప్రచారంచేస్తున్నాం. న్యాయంగా మనం చేస్తున్న పనేమిటి ?

మన వ్యవసాయాలు మరొకరు చెయ్యాలి. మనకు తిండి మరొకరు పెట్టాలి. మన ఫ్యాక్టరీలు మరొకరు నడపాలి. మన పనులన్నీ మరొకరు చెయ్యాలి. ఫలితం మనమనుభవించాలి.

ఇదంతా చూస్తే- మనం నిరంకుశులకన్న యేం తక్కువ చేస్తున్నామని? మనం కూడా వాళ్ళను బానిసలుగా చూస్తున్నామని ఒప్పుకొని తీరాలి.

పైగా- వాళ్లెంత పని చేసినా, మనకు దయాదాక్షిణ్యాలు లేవు. కొడుతున్నాం. తిడుతున్నాం. చంపుతున్నాం. జైళ్ళలో బంధిస్తున్నాం. ఇదంతా మానవులమనిపించుకుంటున్న మనం చేస్తున్న పనేనని మరిచిపోకండి!

ఒక ప్రక్క- భిక్షుకులు. పాపం! వాళ్ళకొక వూరంటూ లేదు. ఏవూళ్లో యెప్పుడుంటారో, ఎక్కడి ఎంగిలికూళ్ళు తింటుంటారో మనమూహించం. పొట్టకోసం వారి కుటుంబమంతా ఎంతటి కష్టదశ ననుభవిస్తున్నదో మన మెరుగం. అయితే- యిదంతా మనం నివసిస్తున్న లోకంలో నేనని జ్ఞప్తికుంచుకోండి!

లోకంలో ఈఅసమానత్వం, దారిద్ర్యం, కాటకంపోయి- సర్వమానవ సమానత్వం నెలకొల్ప బడవలసిన అవసరం ఎంతైనా వుందనేది- మానవుల మనందరివిధి, బాధ్యత అని తెలుసుకోవాలి.

ఒకరినొకరు దోపిడీ చేయటానికి వీలు లేదు. నిరంకుశులైన జమీందార్లు, సంస్థానాధీశులు, సామ్రాజ్యవాదులు,

పెట్టుబడిదార్లు, అభివృద్ధి నిరోధకులకీ జాతీయ ప్రభుత్వంలో స్థానం లేదు. సోమరిపోతులు సెలవుపుచ్చుకోవాలి. ప్రతివారూ కష్టపడి సంపాదించుకోవాలి. ప్రతివారికీ తిండి, బట్ట, వైద్య, విద్య, వినోద విజ్ఞాన సౌకర్యాలు పూర్తిగా లభించాలి. ఎవరి వృత్తులనూ అగౌరవ పరిచడానికివీలు లేదు.

ఆ వ్యవస్థకోసం మన ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. మన మంతా సర్వవిధాల తోడ్పడి విజయాన్ని చేకూర్చాలి.

అప్పుడే దేశానికి సుస్థిరశాంతి చేకూరుతుంది అప్పుడే- మనది ఆదర్శలోకమవుతుందని మనవి చేస్తూ విరమిస్తున్నాను. శ్రీ మధుగారు వుపన్యసిస్తారు. సావధానంగా వినండి!

(చప్పట్లమధ్య అబ్బాస్ కూర్చోవడం, మధు లేవడం జరుగుతుంది)

మధు: సోదర సోదరీమణులారా!

నేడు మనదేశంలో జరుగుతున్న అల్లర్లు అణిగి పోతు న్నాయి. సర్వవిధాల తోడ్పడ్డ మీ అందరికీ మా కృతజ్ఞతాభి వందనా లర్పిస్తున్నాం.

అయితే అల్లరులింతటితో పూర్తిగా ఆగిపోలేదు. శ్రీ అబ్బాస్‌గారు విపులపరచినట్టు ఆ వ్యవస్థ వస్తేనేగాని శాంతి చేకూరదు. ఆ వ్యవస్థ రావాలంటే చాలా కష్టంతో కూడుకున్న పని. అనేకమంది స్వార్థపరులు మన నెదిరిస్తారు. వారందరినీ ఎదుర్కోవడం మనకు సామాన్యవిషయం కాదు.

ఇప్పటికి దేశంలో శాంతిరక్షణదళాలలో కొందరు వాలంటీర్లు తయారయ్యారేగాని వారేసరిపోరు. ప్రతియింటి నుండీ యువతీ యువకులు ప్రోత్సాహంతో బయటికివచ్చి సైనికులుగా తయారవాలి. స్వతంత్రాన్ని కాపాడుకోవాలి. దేశాన్ని జాగ్రత్తగా రక్షించుకోవాలి. ఇది ప్రతివారి ముఖ్య కర్తవ్యమని గుర్తుంచుకొండి! అప్పుడే మనం పడ్డ శ్రమలకు ఫలితం దక్కుతుంది.

తరువాత మీరంతా నేటి మతకలహాలవల్ల ఉత్తర చోట్లనుండి వస్తున్న కాందిశీకులకు మనమంతా పూర్తి సహకారాన్నివ్వాలి. పాపం! అనేకమంది తమ ఆస్తిపాస్తులను, వెండిబంగారాలను చివరకు కుటుంబాలనుకూడా వదిలేసి, బాధలు భరించలేక పరాభవాలతో క్రుంగిపోయి చెల్లా చెదరుగా పరుగెత్తుకొని వస్తున్నారు. మనం వారికి గృహాల నివ్వాలి. మనతోపాటు భోజనం సప్లయి చేయాలి, మన గుడ్డల నివ్వాలి. మన కుటుంబీకులుగా, మన సోదర సోదరీ మణులుగా చూచుకొని హృదయంలో పెట్టుకొని కాపాడాలి. అలాగే యిక్కడి మైనార్టీ వర్గానికికూడా మనం అండగావుండి వారిని హింసిస్తున్న గూండాల నరికట్టాలి. వారి భయాన్ని పోగొట్టాలి. మనతో సహకరించమని చెప్పాలి. వారి కష్ట నష్టాలను విచారించాలి.

అయితే ఏ కాందిశీకులుకూడా యిక్కడ అల్లర్లు రేపకుండా కనిపెట్టాలి. వదంతులను నమ్మకూడదు. ధైర్యంతో

దుండగీంద్ర పనిపట్టాలి. శాంతి సౌఖ్యాలకై మన యావచ్ఛ క్తినీ వినియోగించాలి. మనదేశంలో జీవిస్తున్నది మానవులమే ననీ, రాక్షసులము కాదనీ నిరూపించాలి. మన పవిత్రభారతా వనిని ఆదర్శవంతంగా తయారుచేయాలి. ఇంత బ్రహ్మాండమైన కార్యక్రమం నెరవేరాలంటే మీ అందరి సహాకారమూ, ఐక్యతా తప్పనిసరి.

అయితే— మీరెవరైనా కాందిశీకులకు చుప్పట్లు, కంబళ్లు, దొక్కాలు, చీరెలూ, డబ్బూ సాయం చేయదలిస్తే ఈసభలో యివ్వొచ్చు !

(ప్రేక్షకులనుండి కొంతడబ్బు, దుస్తులువస్తాయి. అవసరమైతే వారి లిస్టును చదివివినిపిస్తే మంచిది. అంతా అయిపోయ్యాక మధు కూర్చోబోతూ)

(శ్రీ) లీలగారు వుపన్యసిస్తారు (కూర్చుంటాను. చప్పట్లమధ్య లీల లేస్తుంది)

సోదరీ సోదరులారా !

నేను మీకొక ముఖ్యవిషయం మనవిచేయ దలచాను. ఫ్యాక్టరీ కార్మికులుగాని, యితర కర్మాగారాల్లోని కార్మికులు గాని ఈమతకలహాల్లో పాల్గొంటున్నట్టు తెలుస్తున్నది. కాని-డబ్బు ఆశకు మీరు సోదరులతో కలహించడం తెలివితక్కువ.

మనకీ కలహాలతో యేమీ సంబంధం లేదు. మనమంతా యిందాక (శ్రీ) అబ్బాస్, మధుగార్లు చెప్పినట్టు— ఆదర్శలోకాల వైపు పురోగమించవలసిన మనం— అభ్యుదయపథంలో విహ

రించవలసిన మనం— నీచులు, గూండాగిరి, నిరంకుశులు అయిన మీ యజమానుల మాటలు విని, ఎనటిజాతిసోదరుని హత్య చేయడం ఘోరం!

మనం వూహిస్తున్న రామరాజ్యాని కది బాట కాదు. మనం కలలు కంటున్న ఆదర్శపథానికి త్రోవ అదికాదు. న్యాయంగా మనకు మతాలతో కులాలతో ఏం పని? అంతా ప్రొద్దున్నే లేచి ప్రొద్దూకేదాకకష్టపడి జీవనభృతిని సంపాదించు కుంటున్న మనకు ఒకరిపై మరొకరికి ద్వేషమెందుకు?

ఆ ద్వేషాలు- డబ్బు, కీర్తి, సామ్రాజ్యాలకు ప్రాకు లాడే ప్రజాద్రోహుల లక్షణాలు. మీరు వారి కీలుబొమ్మలు కాకండి! కొద్దిరోజుల్లో ఆ వ్యవస్థ మారిపోతుంది.

మీకు మహమ్మదీయులంతా క్రూరులని నూరిపొయ్య వచ్చు. కాని, మీరా మాటలు నమ్మకండి! మనలో క్రూరులు న్నట్టే వారిలోనూ క్రూరులుంటారు. అంతమాత్రాన ఆ జాతి జాతంతా క్రూరులుకారు. ఏజాతివాడైనా సరే— దుండగాలు చేస్తుంటే వెనుకా ముందూ చూడకుండా ప్రభుత్వసాయంతో నిర్దాక్షిణ్యంగా అణిచిపారెయ్యండి! దేశంలో శాంతిని నెల కొల్పండి! జాతిమతభేదాలు విడనాడండి! అలా చేస్తారనికూడా నాకు మీమీద విశ్వాసం వుంది. ఎందుకంటే- యిప్పటిదాకా మీరు గుండాయిజాన్ని అరికట్టడంలో సాయపడుతున్నారు. ఇప్పుడే కాందిశీకులకుకూడా తోడ్పడ్డారు.

తర్వాత నేను నా సోదరీమణులకు ముఖ్యంగా మనవి చేసేదేమంటే ఇప్పటివరకు పురుషులే ఎక్కువగా కల్లోలాల నణుస్తున్నారు. ఇకముందు అలా కుదరదు. మీరంతా ముందుకురావాలి. అనేకమంది స్త్రీలు హత్యలకు గురవు తున్నారు. ఘోర అవమానాల పాలబడుతున్నారు. విపరీత హింస లనుభవిస్తున్నారు. శిశువులనేకులు కత్తికోతలకు బలి అయిపోతున్నారు.

వీటన్నిటినుండీ మనం సురక్షితంగా బయటపడి విపరీతంగా చెలరేగిన గూండాల నందరినీ అన్నివిధాలా అరికట్టి, సుస్థిర శాంతిదాయకమైన ఆదర్శలోకాన్ని చవిచూడాలంటే పెద్దలు, పిన్నలు, యువతులంతా అన్నివిధాలా పురుషులకు పూర్తి చేయూతనివ్వాలి. రక్షణసంఘాల్లో చేరాలి. అప్పుడే మన కార్యక్రమం సఫలత చెందుతుంది. ఒక్కసారి గూండా రాజ్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని రుద్రమదేవి, ఝాన్సి లక్ష్మి బాయీలు కండి! కదనరంగానికి వుద్రూతలూగుతూ పరుగెత్తండి! ఇదే నా మనవి! మీరంతా నా సలహా పాటిస్తారని ఆశతో యిక ఈ సభను విరమిస్తున్నాము.

[చాలాసేపు చప్పట్లు మోగడం ఆగిపొయ్యాక- అంతా లేచి వెళ్ళి పోతారు. ఒకరిద్దరు వాలంటీర్లు, అక్కడి బల్లలు, కుర్చీలు తీసేస్తారు. వాలంటీర్లు, మధు ముందువెళ్ళాక- లీల, అబ్బాస్‌లు వెనుక వెళ్ళిపోతారు.

వారటు వెళ్ళగానే - రఘుపతిచే తరుమబడి వణుకుతూ సేఠ్జీ ప్రవేశిస్తాడు. రఘుపతి కత్తిచూపుతూ]

రఘు : చివరకు, నీ కూతురునుకూడా వాళ్ళల్లో కలిపావే?

సేఠ్జీ : నామాటవినకుండా వెళ్ళిపోయింది. నా తప్పేమీ లేదు రఘూ!

రఘు : నా దగ్గర నీ పగటివేషాలు పనికిరావు భాయీ!

సేఠ్జీ : క్షమించురఘూ! నా దోషమేమీ లేదు.

రఘు : కూతురును అదుపులో వుంచుకోలేని వాడవు, నీవు మాకేంపనికొస్తావురా వెధవా! ఆ నగలన్నీ ఎక్కడ దాచావో చెప్పు!

సేఠ్జీ : చీకటి కొట్లో వున్న - ఆ ట్రెజరీలోనే.

రఘు : కష్టపడకుండా నే అంతసొమ్ము అన్యాయంగా కాజేద్దామనుకున్నావుగదూ! ఇప్పుడెవడడ్డంవస్తాడో చూద్దాం!

(సేఠ్జీ రెక్కలువిరిగించి, అరవకుండా నోట్లో గుడ్డలు కుక్కుతుంటాడు. "రక్షించండి బాబూ! రక్షించండి!" అని సేఠ్జీ కేకలు వేస్తాడు. చప్పన- అబ్బాస్, లీలలు ముందుగాపరుగెత్తుకొనివచ్చి సేఠ్జీని రక్షింపప్రయత్నిస్తారు. కాని, సేఠ్జీని పొడవబూనిన రఘుపతి- అబ్బాస్‌ను పొడిచి పరుగెత్తుకొని పోతాడు. ఈ సందట్లో సేఠ్జీ తప్పించుకుంటాడు. అబ్బాస్ పడిపోతాడు. రక్తం కారుతుంటుంది లీల అదుగ్గాపడుతుండగా- మధు, వాలంటీర్లతో వచ్చి, వాలంటీర్లను రఘుపతికోసం పంపిస్తాడు.)

మధు: లీలా! ఇది పెద్దగాయంలా కనబడుతున్నది. కనుక వెంటనే ఆస్పత్రికి చేర్చాలి.

[అబ్బాస్‌ను ఇద్దరు చెరోవైపు పట్టుకొని నడిపించుకొని వెడతారు. వారటువెళ్ళగానే- ప్రజలు వాలంటీర్లు కర్రలతో ప్రవేశం)

— పా ట —

పదండిరా, పదండిరా
శాంతి, సత్యా, ధర్మమహింసా
సాధనములు మాకున్నాయంటూ ॥పదండిరా॥
భరతభూమిలో మతకలహామ్ములు
తిరిగి తలెత్తగ తావే లేదని ॥పదండిరా॥
పెట్టుబడులతో, పొట్టలు బెంచిన
దుష్టాత్ములు, దుర్మార్గులు లేపే
మతకలహాల్, మతకలహాల్
మతకలహాలను మాయంజేయగ ॥పదండిరా॥

(శ్రీరామకవచం)

(రఘుపతిని కర్రలతో మోదుతూ ఈడ్చుకొస్తారు. రఘుపతి వేషమంతా మారింది. జుట్టు చెదిరిపోతుంది. గుడ్డలు దుమ్ముదుమ్మవుతాయి. బిక్క మొహాం పడుంది. ప్రజలు బాదుతూ, జుట్టుపట్టుకొని, పాటపాడుతూ ప్రవేశం]

— పా ట —

కొట్టూ, కొట్టండి, కొట్టండిరా
కాళ్ళువిరగ— బుర్రపగల— పండ్లనూడ ॥కొ॥
1. దొంగముండకొడుకూ_బల్_దోపిడీగాడూ
సావగొట్టినాడూ_మన_సాటిపెజల బట్టీ... లేచి ॥కొ॥

2. కొంపతగులబెట్టె-నా-కున్న ఆస్తిబొబ్బ
   మా పొల్లసేయిగుంజె-నే-సెప్పకుంటెసిగ్గూ, లేచి ॥కొ॥
3. తాసుపాములాంటి-యీ-తల్లి మొగుడువుంటే
   మనవూపిరుండనీదు-రావోయి లేచి బాగ ॥కొ॥

మధు: ఆగండి! ఆగండి!

ప్రజల్లో ఒకొక్కరు :

1. మా అబ్బాస్‌గారిని కొట్టినవాడిని సహించం.
2. మాలో మాకీ విభేదాలు పెట్టిన గూండాలకీ దేశంలో స్థానంలేదు.
3. మతకలహాలు రేపిన ఈ సుండగింద్రుడు బ్రదకడానికివీల్లేదు.

1. చంపి పారెయ్యాలి.

2. కాదురా! చిత్రవధ చెయ్యాలి.

3. ఎబ్బే! జుట్టుగొరిగి, బొట్టుపెట్టి, గాడిదమీద ఎక్కించి వూరంతా త్రిప్పాలిరా!

1. కాదురా! ముక్కలు ముక్కలుచేసి పులుసొండాలిరా!

[మధు విజిల్ వేస్తాడు...అంతా ఒక లైనులోకి వస్తారు.]

2. పారిపోతాడేమో వెధవ!

3. ఇక, నరకానికే పోవాలి.

మధు: ఏయ్? చేతులు వెనక్కు కట్టండి! (కడతారు) ఏం రఘుపతీ! మతకలహాల మజా యెలావుంది?

1. మాకమ్మగావుంది.
2. తిన్నాకొద్దీ తినబుద్ధవుతున్నది.

(రఘుపతి మరణం)

మధు: గూండాలగతి ఎక్కడైనా యింతేనని తెలుసుకో రఘుపతీ! దేశాన్ని నాశనం చేద్దామనుకున్నావు గదూ! ఎప్పటికైనా గుర్తుంచుకో రఘూ! ప్రజలు హింసాకాండను ఎక్కువరోజులు సహించరు. వారికి సత్యం, ధర్మం, శాంతి, సౌఖ్యాలు కావాలి. ప్రజలముందుకు పోదాం - పదండి.

— తెర —

# తొమ్మిదో రంగం

—* గది *—

[వీపుకు కట్టుతో, వాలుకుర్చీలో పడుకొని అబ్బాస్ పుస్తకం చదువుతుంటాడు. లీల- అక్కడి పుస్తకాలు, పత్రికలు సర్దుతూ, అబ్బాస్ ప్రక్కనున్న బల్లపై కూర్చొని బత్తాయీపండు వొలిచిస్తుంటుంది. ఒకమూల బల్లపై మందుసీసాలు. లీల పాటపాడుతుంటుంది]

— పాట —

స్త్రీ భాగ్యమే - భాగ్యమూ
విప్లవ వీరుల - వీరపత్నులై
విలసిల్లెడి - మన భారత భువిలో ॥స్త్రీభాగ్యమే॥
శాంతి సౌఖ్యముల - కాపాడుటకై
వీరపురుషులకు - చేయూతనిచ్చే ॥స్త్రీభాగ్యమే॥
విశ్వమానవ - సమానత్వమును
నెలకొల్పుటకై - పాటుపడెడిమన ॥స్త్రీభాగ్యమే॥

అబ్బాస్ : పాపం! నాకోసం నీవెంత కష్టపడుతున్నావేం లీలా?

లీ ల : ప్రాణాలిచ్చే వాళ్లిస్తుండగా - నేనీమాత్రం నీకుసాయ పడడంకూడా- ఒక, గొప్పవిషయమేనా?

అబ్బాస్ : మన భారతదేశంలో. దయ, సానుభూతులు చాలా ఎక్కువసుమా!

లీ ల : అందుకే- ఆదర్శలోక మంటున్నారు.

అబ్బాస్ : దాంతోపాటు యిప్పుడు నరకమనీ అంటున్నారుగా!

లీ ల : కష్టాలెక్కువ రోజులుండవు అబ్బాస్!

అబ్బాస్ : అయితే- పారిపోయిన కాందిశీకులంతా తిరిగి తమ యిండ్లకు చేరినట్లా? వారి ఆ సిపాస్తులు, కుటుంబాలు పాపం! ఎంతనష్టమై పొయ్యాయోగదా!

లీ ల : మీకృషివల్ల చాలావరకు సవ్యంగానే జరిగింది.

అబ్బాస్ : మాకృషేమిటి లీలా! దేశం బాగుపడాలంటే. ప్రతి వాడూ కృషిచేయాలి. ఆరాత్రి- నీవేగనుక నన్ను రక్షించకుంటే- నేనేమైపొయ్యేవాణ్ణో!

లీ ల : చూస్తూ, చూస్తూ రక్షించకుండా ఎలావుంటాను?

అబ్బాస్ : పోనీలే- మనపొగడ్తలే యెక్కువైపోతున్నాయిగాని - మధుకు జబ్బుగావుందన్నావుగదూ!

లీ ల : అవును. కొడుకును చెడగొడుతున్నదని ప్రభను వాళ్ల వూరుకు పంపించే యేర్పాటు చేశాడు- శివరామయ్య. ఆబిడ్డ ముఖం చూడండి- మధు క్షణం బ్రతుకలేదు అదే - ముఖ్యమైన జబ్బు.

అబ్బాస్ : ఈ స్త్రీ ఆకర్షణచాలా ఘోరమైన వ్యాధిసుమా!
ఏదీ! చాక్లెట్ యివ్వు కొద్దిగా?

లీల : (చాక్లెట్-యిస్తూ) సరి స్త్రీ లేకుంటే సుఖమేముంది
అబ్బాస్!

అబ్బాస్ : వాడేమో ప్రభను ప్రేమించి వుంటాడు. ఆవిడ తల్లి
దండ్రులేమో కూతురుయివ్వటానికివొప్పుకోరు బహుశా!

లీల : బహుశా యేమిటి? పెళ్ళికి ముహూర్తంగూడా నిశ్చ
యించారట. కాని, ప్రభ యితరులను వివాహమాడదను
కుంటాను.

అబ్బాస్ : ఏమిటో లీలా! ప్రభ సుధాకర్నే గనుక పెళ్ళాడితే
వాడి గతేంగాను?

లీల : అదే - యిప్పుడొచ్చినచిక్కు!

అబ్బాస్ : ఒకరికొకరు ప్రేమలో పడకుండా వుండే మందే
మైనా వుందేమో!

లీల : ప్రేమను వద్దనుకుంటే-సృష్టే వద్దనుకోవాలి.

అబ్బాస్ : అలాగనికాదు లీలా! మొదట్లో ప్రేమలో పడడం,
కార్యం నెరవేర్చకపోవడం-కృశించి నశించడం-యిదేనా
ఫలితం!

లీల : కొన్ని విపరీత పరిస్థితులకు తట్టుకోవాలిమరి.

అబ్బాస్: జీవితాన్ని మహా కాచి వడబోశావుగాని- ప్రస్తుతం
మధు ఏంచేయగలడుచెప్పు! పోనీ- వాడంటే, అన్ని
[illegible]కీ ధైర్యంచేస్తాడు! ప్రభ [illegible]

లీల : అందుకే- స్త్రీలుకూడా పురుషులతో పాటు ముందంజ వెయ్యాలని.

అబ్బాస్: అది అనుకున్నంత తేలిక కాదేమో! ఈ యువతీ యువకులను ధ్వంసం చేస్తున్నది, అభివృద్ధి నిరోధకులైన వారి తల్లిదండ్రులేసుమా!

(సేఠ్జీ అందుకుంటాడు)

సేట్జీ : ఇంకా కసితీర లేదునాయనా!

అబ్బాస్: వారిమీద కసితీర్చుకోడానికి మాసామ్రాజ్యం పోతుంది? దేశం నాశనమవుతున్నదనిగాని-

సేఠ్జీ: నన్ను క్షమిస్తావా లీలా!

లీల : నేనేం క్షమిస్తాను. దేశం క్షమించాలి.

అబ్బాస్ : (కుర్చీలోనుంచి లేచి, జేబులోనుండి తాడుతీసి సేఠ్జీ చేతులకు కడుతూ) లీలా! క్షమించు! మీ నాన్నను బందీగా పంపాల్సి వుంటుంది. చాలా రోజులనుండి తప్పించుకొని తిరుగుతున్నారు.

సేఠ్జీ : ఏం లీలా! ఏమంటావు?

లీల : (ఎలాగైనా తండ్రిగదా!) ఏం అబ్బాస్! నాన్నను వదల డానికి వీలులేదా?

అబ్బాస్ : లీలా! నీ మనసును నొప్పించడం నాకూ బాధగానే వుందిగాని- నా విధిని నెరవేర్చాలి. తప్పదులీలా!

సేఠ్జీ : నా ప్రాణాన్నికూడా రక్షించినమీకు నా కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. కాని, నాకీశిక్షతప్పదా బాబూ!

అబ్బాస్ : మీ ప్రాణాలను కాపాడడం ఒకగొప్పకాదు. అది ప్రతి మానవుని విధనుకోండి. మానవులతో మాకే విరోధం లేదు. మానవత్వాన్ని మరిపించే క్రూరత్వం, కుటిలత్వమంటేనేమంట. దానికి శిక్ష తప్పదు.

సేఠ్జీ : ఇంకా నాలో యేంకుటిలత్వముంది నాయనా! ఉన్న వొక్కకూతురూ దూరమైంది. కార్మికులంతా కలిసి మిల్లులు మూసేసి వ్యాపారాన్ని ఆపేశారు. నమ్ముకున్న రఘుపతే చంపపూనుకున్నాడు.

అబ్బాస్ : హాయిగా, సోదరతుల్యంగా, ఆదర్శవంతంగా జీవిస్తుందనుకున్న దేశాన్ని-ముక్కలూ, చెక్కలూచేసి కల్లోల పరచిన మీ మతావేశమో?

సేఠ్జీ : ఇంకా మతావేశమా? ఇక్కడికి జరిగిన పరాభవం చాలదూ?

అబ్బాస్ : మీకు వ్యక్తిగతంగా పరాభవం జరిగిందని దేశానికేంలాభం? కుల, మత, జాతివిభేదాలను కల్పించే ఒక్క కీటకంకూడా దేశంలో బైట తిరగడానికివీల్లేదు. ఆ ద్రోహులకు శాస్తి జరగాల్సిందే.

సేఠ్జీ : చేయగలిగిందేదో యిదివరకే చేశాను. ఇంకా యేం చేస్తాను నాయనా!

అబ్బాస్ : ఇప్పటిదాకా ఈ మత ప్రవక్తలను నమ్మి, నమ్మి దేశం యిందాకావచ్చింది. అయినా-దేశంలో సుస్థిర శాంతి నెలకొని, ఏ మతహంకారుల ఆటలూ సాగవను కున్నప్పుడు ఎలాగూ విడుదల చేస్తారు. అప్పుడే రావచ్చు.

సేఠ్జీ : ఏం లీలా? నీచేతిలో యేమీ లేదా?

లీల : ఏడవడందప్ప నేనేంచేస్తాను చెప్పునాన్నా! (గంభీరంగా) చేసినతప్పుకు ఈ లోకంలోనే శిక్షవుంటుందేమో నాన్నా!

సేఠ్జీ : అవునులీలా! మానవ లోకాన్ని నరక కూపంగా చేయదలచిన ఈపాపికి శిక్ష తప్పదు. ఇదిగో దస్తావేజు! ఈ జేబులోవుంది తీసుకో! ఆస్తి నీపేర వ్రాసివుంచాను.

అబ్బాస్ : (ఏదో కాగితమ్మీద వ్రాసి వాలంటీరు చేతికిచ్చి) వీరిని స్టేషనులో అప్పగించు!

సేఠ్జీ : (వెనక్కు-చూస్తూ) వెళ్లొస్తా లీలా! (వెడతాడు. లీల విచారంగా వుంటుంది... కొంతసేపటికి)

అబ్బాస్ : ఏం? మీనాన్నను అరెస్టుచేసినందుకు విచారపడుతున్నావా లీలా!

లీల : దేశం బాగుపడాలంటే- మన వ్యక్తిగత విచారాలకు తావిస్తే ఎలా?

అబ్బాస్ : నీకు తెలియందేముంది లీలా? ఇక- ఈ ఆస్తితో సుఖంగా కాలంగడుపు!

లీల : ఆ దోపిడీ ఆస్తి ఎవరికి కావాలి? మన సంఘపరం చేసి– నీతోనే యావజ్జీవితం గడుపుతా.

అబ్బాస్ : (ముసిముసినవ్వుతో) నాతోటా? నేను ముస్లిం మతస్థుణ్ణి తెలుసా?

లీల : ఆఁ, మళ్లీ అదేమాట!

(ఇద్దరూ జంటగా భుజాలపై చేతులువేసుకొని)

మతం వేరైతేను యేమోయ్
మనసులొకటై మనుషులుంటే
జాతమన్నది లేచిపెరిగీ
లోకమున రాణించునోయ్!

(గురజాడ)

(గీతం అయిపోతుండగా)

— తెర —

—

# పదోరంగం

## శివరామయ్య యింటిలోగది

[సిగరెట్ త్రాగుతూ, విచారాన్ని సూచిస్తున్న మొహంతో మధు అటూ యిటూ నెమ్మదిగా తిరుగుతుంటాడు. కొద్దిగా పెరిగిన గడ్డం, నలిగిన దుస్తులు, చెదిరిన క్రాఫ్. బ్యాక్ గ్రౌండ్ న పాట వినబడుతుంటుంది.]

— పాట —

నడిదారిలో నన్ను కలిసిందీ
నీ వేగుగ్రామమే నాదందీ
కాలుసరి చేసుకొని
కదలబోతుంటేను
కతలు చెబుతానంటు
వెనుక వైపుకు చేరి
నడవమని తొందర పెట్టిందీ
అంతలో
ఇటుతిరిగి చూడమోకందీ
ఆమె
వెనుదిరిగి వెళ్ళిపోయింది.

నవ్వులో నవ్వుల్ని కలిపిందీ
ఆశల్ని నాలోన రేపిందీ
కాళ్ళనొప్పులచేత
కదల లేకుంటేను
చెట్టునీడను చేర్చి
పోబోవు ప్రాణాన్ని నిలిపిందీ
నా
దాహాన్నికై తా వెళ్ళిందీ
ఆమె
గొంతెండ బెట్టెళ్ళి పోయింది.

నడి బాటలోనన్ను వదిలిందీ
మంచిదారీ నాకు లేదందీ
ఎవరేమి చెప్పినా
ఏమిచేసినా
ఎన్నటికి నయమవని
గాయాన్ని గుండెల్లొ చేసిందీ
నాకు
కారుచీకటినిచ్చి పోయిందీ
ఆమె
వెలుగు వెంటెట్టు కెళ్ళింది.

(వెంపటి సచ్చిదానందశర్మ)

[పాటఅయ్యాక శివరామయ్య మందుసీసాతో ప్రత్యక్షం]

శి వ : మందు తెచ్చారా అబ్బాయీ !

మధు: పాపం ! ఎవరాడాక్టర్ ? అక్కర్లేదని చెప్పలేక పోయ్యారూ ?

శి వ : ఎందుకేడిపిస్తావురా నాయనా- త్రాగు !

మధు: నేనా- మిమ్మల యేడిపించేది !

శి వ : ఏమిటిరా బాబూ ! (సందర్భం మారిపోయిందిగనుక- వాళ్లునిమిరి) ఎందుకు విసుక్కుంటావు నాయనా !

మధు: నిజంగా- నన్ను బ్రతికించుకోవాలనేనా- మీవుద్దేశ్యం?

శి వ : మాకంతకంటే యింకా ఏముంటుంది నాయనా !

మధు: అలాగా ! (నవ్వుకొని)

శి వ : ఏం చెయ్యమంటావు నాయనా !

మధు: ఇంకా ఏంచేస్తారు ? మీరు చేయగలిగిందేదో యిది వరకే చేశారు. ఇకమీరు నాకేమీ చెయ్యక్కర్లేదు. నన్నిలానన్నా బ్రతుకనివ్వండి ! అంతేచాలు ! పైగా- మందులఖర్చుకూడా యెందుకు ?

శి వ : ఈ జబ్బులో యిలాంటిమాటలు చాలాభయంకరంగా వుంటాయి నాయనా !

మధు: అయితే- అనవసరంగా నన్ను మందలిస్తారెందుకు ? (విసుగుగా లోనికెడతాడు. తండ్రి విచారంగా అటూ,

యిటూ తిరుగుతూ ఆలోచిస్తుండగా- మరోవైపునుండి అబ్బాస్, లీలలు వస్తారు)

అబ్బాస్ : ఏమండీ! మధు కెలావుంది? ఏమిటండీ జబ్బు? ఏమన్నాడు డాక్టర్?

శివ : ఏమిటో నాయనా! వేరేజబ్బేమీ కనపడటం లేదట. మందుమాత్రం యిస్తున్నాడు.

లీల : అయితే- మనోవ్యాధయివుండాలి.

శివ : వాడికేం మనోవ్యధలు తల్లీ! ఏదో కోపంవచ్చి నప్పుడు మాత్రం నాలుగు చివాట్లేస్తాను. కాని, అదెప్పుడూ వున్నదేగా! ఇకఅల్లర్లలో పాల్గొనవద్దన్నాను. అవేమో అణిగే పోతున్నాయిగదా!

అబ్బాస్ : అలాంటిబాధలు వానినేమీ లక్ష్యంచెయ్యవండీ!

లీల : అయితే-చూడండి! ప్రభ యెక్కడికెళ్లింది?

శివ : వాళ్ల వూరెళ్లిపోయింది.

అబ్బాస్ : ఆవిడక్కడికి వెళ్లడానికి మీరేమైనా కారకులా?

శివ : ఏదో-ఆరోజుల్లో నేనే అలా పంపాల్సి వచ్చింది.

లీల : ఇంకాయేం? చాలాగొప్పపని చేశారు.

అబ్బాస్ : పోనీ_యిప్పుడు తిరిగి రప్పించకూడదూ?

శివ : ఎలావస్తుంది? ఇ వాళే ఆవిడపెళ్లి జరుగబోతున్నది.

లీల : నిజంగా మీరు పిల్లలపెంచడంకన్న - పుట్టగానే, యే గంగలోనన్నా కలిపి రాకూడదూ?

శివ : నాతప్పేముంది తల్లీ?

అబ్బాస్ : కాకుంటే-అప్పట్లో ప్రభ వుండడం మీకు చికాకుగా వుండి, కొడుకును బాగుచేద్దామని అలాచేశారు కదూ!

శివ : అవును నిజంగా అంతే నాయనా!

అబ్బాస్ : ఇప్పుడో? ఆవిడ వెళ్లడం, మధుకు జబ్బుగావుండడం, వాడిమూలాన మీరుఅవస్థపడడం బాగాలేదూ?

శివ : ఇప్పుడేమనుకుంటే-ఏంలాభం నాయనా?

లీల : అవును చేతిలో వున్నప్పుడు వినియోగించుకోలేని పెద్దలకు ఎవరుమాత్రమేం చేస్తారు?

అబ్బాస్ : చేసిన తప్పుకు అనుభవించండి!

లీల : తానొక్కడే అనుభవిస్తేపర్వాలేదు పాపం! మధ్య మధుకొచ్చింది చిక్కు.

శివ : ఇంతకూ ఈజబ్బు నయమయ్యే మార్గమేమైనా వుందా? లేదా? తల్లీ!

లీల : వేరే మందులేమీ లాభంలేదు. ఆవిడ రావడంతప్ప.

అబ్బాస్ : మీకేమో ఆ వ్యథలవిషయమర్థంకాదు.

శివ : అయితే ప్రభ మామగారింటికివెళ్లి ఆవిడ విషయం కనుక్కొని వస్తానుండండి! (గబగబా లోనికెడతాడు. మధు రంగమ్మాది కొస్తాడు)

అబ్బాస్: ఏరా మధూ! లేనిపోని గొడవల్లో పడ్డావేరా?
మధు: ఏమిటో. పోనివ్వావోయ్- వెధవని!
అబ్బాస్: పాపం! చాలా చిక్కిపోయావ్.
మధు: చేసినతప్పుకు చిక్కిపోవడ మేమంత చెప్పవిషయం కాదుగాని- నీ గాయం పూర్తిగా నెమ్మదించిందా?
అబ్బాస్: ఆ, ఆ! అయితే- నీవుచేసింది తప్పేమీకాదు మధూ! మానవులు చేయాల్సినపనే చేశావు.
మధు: ఎందుకూ_ యిలా వ్యథపడేందుకా?
లీల: దానికెవరేం చేస్తారు మధూ!
మధు: అసలు ఎవరి స్త్రీ హృదయాన్ని గుర్తించకుండా ప్రేమించడమనే బురదలో పడేంత దౌర్భాగ్యం మరొకటుండదోయ్!
అబ్బాస్: ఏరా! ప్రభ నిన్ను ప్రేమించడం లేదంటావా?
మధు: అవును. అందుకే, పెళ్లికి వొప్పుకుంది.
లీల: పరిస్థితులకు తలవొగ్గ కేంచేస్తుంది?
మధు: అందుకే- ఆవిడ తప్పేమీ లేదంటున్నాను ఏదో రాజకీయాల్లో మెలగవలసిన నేను- సంగీతంతో ఆకర్షింపబడడమే చాలా ఘోరమైంది!
అబ్బాస్: హృదయాన్ని మరీ యెందుకు గాయపరచుకుంటావురా!

మధు : గాయపరచు కోవడానికి కాదు. మాన్పుకోడానికే-ఈతిప్పలు!

అబ్బాస్ : మరి ఈ వేష మేమిటోయ్?

మధు : ఎలాగుంటేమాత్రం అడుగ బోయ్యే దెవరు లెద్దూ?

లీ ల : అంత వైరాగ్యం పనికిరాదు మధూ!

మధు : నాకూ-వైరాగ్యమంటే యిష్టం లేదు. కాని, నేను కొన్ని బలవత్తర విషయాలకు లొంగక తప్ప లేదు... అకారణ శోషంతా యిప్పుడనవసరం.

అబ్బాస్ : ఏం? చెప్పకూడదా?

మధు : చెప్పుకొని, పదిమంది నోళ్లలో పడడ మెందుకోయ్? చెప్పుకున్నా యిప్పుడుజరిగేదేమీ వుండదు.

శి వ : (గబ గబా వచ్చి, అందుకుంటూ) అవును ఇప్పుడు జరిగేదేమీ కనబడదు. అత్త, మామయ్యకూడా ప్రభ పెళ్లికే వెళ్లారట! ఏం చెయ్యాలో తోచదు.

మధు : ఎవరూ ఏమీ చెయ్యక్కర్లేదు. నాకేవ్యాధీ లేదు. కాని అనవసరంగా జబ్బు జబ్బు అని-మీరు గొడవపడి, నన్ను గొడవచెయ్యకండి! మీపనేమిటో మీరు చూచు కొండి! (అంటుండగా ప్రభ పాటపాడుకుంటూ, చేతిలో సంచి, తలకు చేతిరుమాలా చుట్టుకొని, కాళ్లకు బూట్లతో, పెళ్లికూతురు వేషంతో గబగబా లోనికి ప్రవేశిస్తుంది)

— పాట —

(ఆటలాడదూ, వదిన - పాటపాడదూ... మరిది)

స్వేచ్ఛ లేదురా - మనసూ - అడుగబోకురా
బలవంతుపు, పెళ్ళిళ్లూ - పట్టిచేతురూ
వెనుకడుగును వేయకూ - ధైర్యముతో పోరుమూ
జీవితమే, సుఖమనియెడి - ధర్మంబును బోధించుము
॥స్వేచ్ఛ లేదురా॥

(అంతా అయోమయంలో పడతారు.)

శివ : నాతల్లి ప్రభవా! (ఎన్నడూ లేని ప్రేమతో కౌగలించుకుంటాడు)

ప్రభ : (సంచి అక్కడపడేసి మధు దగ్గరికెళ్లి) ఇదేమిటి-యిలా అయ్యారు?

అబ్బాస్ : ఏదో కొద్దిగా సుస్తీ చేసిందిగాని-ఎక్కడున్నావు ఇంత కాలం ప్రభా?

ప్రభ : ఎక్కడున్నం చేమిటి? ఇంటినుంచి, పెళ్లిసందడినుంచి, రైలునుంచిగాని- ఏమిటిసుస్తీ?

లీల : ఏదో కించిత్ దగ్గు పడిశమేగాని-ఈవేష మేమిటీ?

ప్రభ : కనబడడంలా? పెళ్లికూతురు వేషం. ఏంలీలా! బ్రతికున్నావా? (కరస్పర్శ చేసి- బూటు విప్పుకుంటూ లీల వ్రాసిన-"ప్రేమమయంబీ జీవితనౌకా" పాటను ఈలలతో, కూనిరాగంతో చదువు తుంటుంది)

లీ ల : ఏయ్ ప్రభా! అది, నా పాట తెలుసా?

ప్రభ : ఇప్పుడిద్దరి పాట - ఒకటిగా నేవుంది లెద్దూ!

(శివరామయ్య లోనికి కదతాడు)

మధు : నీ చిలిపిచేష్ట మానావు కావేం ప్రభా!

ప్రభ : మానెయ్య మంటారా?

మధు : వద్దు! ప్రభా! వద్దు! (చప్పున శివరామయ్య రెండు పూలదండలతో ప్రవేశించి-మధు, ప్రభల చేతికిస్తాడు. మౌనంగా ఒకరి మెడలో మరొకరు దండలు వేసుకుంటారు.)

శి వ : హమ్మయ్య ! తుపానణిగింది! (కొడుకూ, కోడలునూ దగ్గరికి చేర్చుకొని-సంతోషిస్తుండగా మధు-ప్రభలు కలిసి)

— పా ట —

అదిగదిగో...అదిగదిగో
అదిగదిగో, ఆదర్శపులోకం
సుదినము నేడెగదా...
కోరికలన్నీ తీరెగదా
భారతశాంతిని బడసెగదా

ఆదర్శ మార్గాల ననుసరిస్తాము
ఆదర్శ లోకాల నందుకున్నాము
మాదే - దేశం, దేశం - మాదే

మాదే ఆదర్శపు దేశం
మాదే ఆనందపు లోకం
మాదే ఆదర్శపు లోకం
మాదే.....మాదే......

(శ్రీ రామ కవచం)

(పాట అయిపోతుండగా)

— తెర —

# చివరి రంగం

## భారతావని

[భారతదేశంలాగా సెట్టింగ్ తయారుచేయాలి. దానిచుట్టూ అబ్బాస్ లీలా—మధూ, ప్రభలూ—వాలంటీర్లతో ద్రసున్నతో (జాతీయ సేవ) నిలుచుంటారు. పాటను అంతా కలిపి ఒక్కే ఫక్కీలో చదవాలి. అవసరమైన వంపులు భావానికి తగ్గట్టుండాలి. అందరివద్దా-కనీసం కర్రలైనా వుంటేనే బాగు. లేకుంటే-పిడికిలి గొప్ప ఆయుధం]

— పాట —

వెడలండోయ్, వెడలండోయ్
భారతదేశము మాదేనోయ్
దుండగీంద్రకి దేశమునందున—నిలువగనీడే లేదండోయ్
ప్రజారాజ్యమును కూలద్రోసెడి—పాపాత్ముల
దునుమాడెదమోయ్ ॥వెడలం॥
విశ్వమానవ సౌభ్రాతృత్వము—వెలయించెదమీదేశంలో
కరువుకాటకాల్నణచిదేశమును—సుభిక్షంబుగా
చేసెదమోయ్ ॥వెడలం॥
మతకలహాల్ మా మాతృభూమిలో—మంటగలుపుటకు
పోరెదమోయ్
సుస్థిరశాంతిని చేకూర్చుచు—ఆదర్శలోకమును
చేసెదమోయ్ ॥వెడలం॥

(వారణాసి)

— తెర —

# అభిప్రాయం

* * *

ఈ రోజుల్లో ప్రదర్శనాలకోసం చాలా నాటకాలు వస్తున్నాయి. అటు ప్రేక్షకులు, యిటు నటకులు ఉత్సాహంగా నాటకాలమీద అమిత శ్రద్ధ చూపిస్తున్నారు. ముఖ్యంగా సంఘాలు, రాజకీయ పార్టీలు నాటకం మంచి ప్రచార సాధనమని గుర్తెరిగి ఆ పార్టీల మహోద్దేశాలకూ, కార్య క్రమాలకూ దోహదమైన నాటకాలు వ్రాసే ప్రోత్సాహం కల్గించి ప్రదర్శింపిస్తున్నారు. తేలికైన నాటకాల విషయం చెప్పనక్కర్లేదుగాని- వీర తెలంగాణా ప్రజల జీవితాన్ని అద్భుతంగా చిత్రించిన నాటకం "మాభూమి" తర్వాత - భరతభూమికారోగ్యోత్సాహానికి హురవించే ప్రదర్శనాప్రయత్నంలో "ఆదర్శలోకాలు" ఒకటి.

"ఆదర్శలోకాలు" ఒక జాతీయనాటకం. నేడు, దేశం జాతీయ ప్రభుత్వంచేతిలోకి వచ్చిన తర్వాత మనదేశ సరిహద్దుల్లోనుంచే వెలికి జాచే విషపు నాలుకలు మన ప్రభుత్వ జాతీయతను తుడిచివేసి ఒక అభివృద్ధి నిరోధక ప్రభుత్వాన్ని స్థాపించాలనే దుష్ప్రయత్నాలు జరుగుతున్నట్లు లోతు తెలిసిన వారికి తెలియవచ్చింది. కాని- ఆ రహస్య, కుటిల యత్నాలు ప్రజా సామాన్యానికి తెలియవచ్చింది కాదు. ఈ కుట్రలో భాగస్వాములైన పెద్ద ధనిక పెట్టుబడిదార్లను, జమీందార్లనూ, సంస్థానాధీశులనూ, మతసంఘాలనూ ప్రజా సామాన్యం తెలిసికోలేక యీ కష్టాలకు కారణం - అన్యమతస్థులనీ, ఏవో పార్టీలనీ మోసపోతున్నది.

ఈ పరిస్థితుల్లో నరసింహారావుగారు- "ఆదర్శలోకాలు" సృష్టించే బాధ్యత తీసుకొన్నారు. నిజంగా, యీనాడు శాంతియుతమైన సోషలిష్టు (సామ్యవాద) వ్యవస్థను స్థాపించాలనే ఆదర్శనాయకుడగు నెహ్రూ ప్రభుత్వాన్ని కూలద్రోయాలని ఎవరెవరు యత్నిస్తున్నారో వ్యక్తపరచడంలో రచయిత నిజం చెప్పాడు. తర్వాత- వారిని పడగొట్టాలంటే ప్రజల కర్తవ్యమేమంటే- "శాంతిరక్షణ సంఘం"లాంటివి స్థాపించి పనిచేయాలని మార్గం చూపించాడు. అయితే తన "ఆదర్శం" సామ్యవాద వ్యవస్థ. అట్టి వ్యవస్థ నెలకొల్పడానికి ఆజన్మవ్యతిరేకులైన "సేఠ్"లాంటి పెట్టుబడిదార్లు, "శివరామయ్య" లాంటి అగ్రహారీకులు ఎలాసంచరిస్తారో, వారితో ఎలా మెలగాలో,

వాళ్ళెలా శిక్షించాలో, వ్యక్తపరచడంలో సామ్యవాదమార్గమే చూపించాడు రచయిత.

ఈ నాటకంలోని కొన్ని ముఖ్యాంశాలు తన రాజకీయ ఆదర్శం ప్రచారం కావడానికి ప్రాముఖ్యమైనవి. అవి (1) ధనవంతుల బిడ్డలైనా లీల, అబ్బాస్‌లు నవనాగరికతలో విజ్ఞానవంతులై, సామ్యవాదం కావాలన్నదే ఆదర్శవంతులవడం (2) అది నెరవేరడానికి తన విధ్యుక్త ధర్మాన్ని మరిచిపోకుండా తండ్రినైనా, ఎవరినైనా దుర్మార్గానికి వుచితశిక్ష నివ్వటీకడం, (3) ప్రతీకారం (Retaliative Spirit) ముస్లింలయెడ చేసితీరాలను హిందూ మత సంఘాల వాదనను ఆమూలాగ్రంగా ఖండించడం (4) దుండగీండ్రు (హిందువులైనా) నిజస్వరూపం చూపడం (5) ముస్లిం అబ్బాస్, హిందూ లీలల వివాహం.

ఈ సంఘటనలు ఎందువల్ల ప్రాముఖ్యమంటే- సామ్యవాద ఆదర్శ జీవులకు ముఖ్యాంశాలూ, దోపిడీదార్లకూ వారి సిద్ధాంతాలకూ అతి దూరమైనవిన్నీ.

అసలు, నాటకంగురించి- మొదటిరంగంనుంచి చివరి రంగంవరకూ కథ ఒక యినుపగొలుసులా సాగిపోతుంది. సంభాషణ ఘాటుగా, వ్యంగ్యంగా, వెలుగునిచ్చేవై- ఆశక్తితో ప్రజలు వినగోరేట్టుగానూ వున్నది. ఈ నాటకం ప్రదర్శిస్తుంటే- సిపాయిలువీరోత్సాహంతో మాతృదేశరక్షణకు "మార్చ్" చేసినంత వుజ్జ్వలంగా వుంటుంది. నాటకాంతాన ప్రేక్షకులు— సమగ్రమైన ఆదర్శపంథా అనుసరించే జ్ఞాపకంతో వెడలితీరుతారు.

అందుకని- సామ్యవాది, రచయితఅయిన నరసింహారావుతో నేనిట్లా అన్నాను— "దీని సత్ఫలితాన్ని చూచుకొని- మళ్లీ నీ కలంతో మా ప్రజలకో ఫలాన్ని ప్రసాదించమని."

జగ్గయ్యపేట
16—12—1947

వి. కృష్ణారావు.



తెనుగుతోట, మొఘల్రాజపురం, విజయవాడ, H. No. K. 61 వారి కొరకు అభ్యుదయప్రెస్‌లో ముద్రింపబడినది.

# "కళానాథ్రి"

## ఆశయాలు

---

తెలుగులో కొరవడ్డ సినిమా, నాటక వాఙ్మయాన్ని అభివృద్ధి పరచుట——

సినిమాలన్నా, సినిమా వ్యక్తులన్నా, నాటకాలన్నా, నాటక వ్యక్తులన్నా – ప్రబలిన దురభిప్రాయాల్ని పారద్రోలుట——

మన నాటక, సినిమా పరిశ్రమలు మహోన్నత శిఖరాల నందుటకు సాయశక్తులా ప్రోత్సాహ మిచ్చుట.



## కళాసేవే

ప్రధానాశయం



త్వరలో —

"విప్లవ శంఖం"

"మారే ధర్మాలు"

"ప్రజా సేవ"

[నాటకాలు]

రచన: కె. యల్. నరసింహారావు

★

"సంఘ శకటం"

[నాటకం]

రచన: శ్రీరామకవచం సత్యానారాయణ

★

"నాటకానుభవాలు"

(వివిధ రచయితలు)

★

"సినిమా" (వ్యాసాలు)

అనువాదం: 'క్రాంతి'

★